PRSVM02A 136

సాహిత్య ప్రస్థానం

సంపుటి : 12 ఏప్రిల్ 2012 సంచిక : 75

# మూడు మాటలు...

ఉప ఎన్నికలు ముగిసిన తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో మరోసారి ఉద్రేకాలు పెంచుతారా అని సందేహం వేస్తున్నది. ఇప్పటి వరకూ అన్ని సందర్భాలలోనూ ప్రజలు ఇస్తున్న సందేశం ఏదైనా వుందీ అంటే అది ప్రశాంతతను, ప్రజాస్వామిక విలువలను కాపాడాలని మాత్రమే. కనుకనే ఎన్నో కల్లోలాల తర్వాత, కౌటిల్యాల తర్వాత కూడా ఈ రాష్ట్రం ఇలా వుండగలుగుతున్నది. ఎవరి రాజకీయాలేమైనప్పటికీ ఉపయోగం లేని ఉద్రేకాలు, ఉన్మాదాలు ప్రజలకు చేసే మంచి శూన్యం. ఒకవైపున కేంద్ర రాష్ట్రాలలో పాలకులు ప్రజలపై భారాల పరంపరలు విధించడమే గాక కఠిన నిర్ణయాలు తప్పవని హెచ్చరికలు చేస్తుంటే దాన్ని పట్టించుకోని పాక్షిక వ్యూహాలు మేలు చేయవు. వీటన్నిటి మధ్యా అస్తిమితాంధ్ర ప్రదేశ్ ఏమి కానున్నదనేది ఆందోళన కలిగించక మానదు. అందుకోసం ఇంకా జరగాల్సిన సామూహిక ఉప ఎన్నికల ఫలితాల కోసం వేచి చూడాల్సిందే.

. . .

ఈ కాలంలో బయట పడుతున్న కుంభకోణాలు చూస్తుంటే తల తిరిగి పోతుంది. 2జి స్పెక్ట్రంలో 2 లక్షల కోట్ల కుంభకోణం కలిగించిన సంచలనం చల్లారేలోగానే ఇప్పుడు ఏకంగా పదిన్నర లక్షల కోట్ల రూపాయలు బొగ్గు కుంభకోణం దేశానికి కారునలుపు పూసేసింది. ప్రజల సంపదనూ, ప్రకృతి వనరులనూ ఇలా అప్పనంగా కార్పొరేట్ కుబేరులకు కట్టబెట్టే ప్రక్రియ అత్యంత దుర్మార్గమైంది. తీరా బయటకు వచ్చాక షరా మామూలుగా ఇది నిజం కాదని కప్పిపుచ్చే ప్రయత్నం జరుగుతున్నది గాని అసలు సంగతి రేపైనా బయటకు రావడం తథ్యం.

. . .

చాసో మార్క్సిస్టు కాదని వేల్చేరు నారాయణరావు చేసిన విపరీత విశ్లేషణపై ప్రగతిశీల మిత్రులు లేవనెత్తిన అభ్యంతరాలు చాలా సముచితమైనవి. సిద్ధాంత రాహిత్యం అనీ ఆధునికానంతర వాదమని రకరకాల పేర్లు పెట్టుకుని కొంతమంది సాంస్కృతిక రంగంలో ప్రజాస్వామిక సారాన్ని మటుమాయం చేసేందుకు వింత వాదనలు తెస్తున్నారు. చాసో ఒక్కరే గాక ఆయన సమకాలికులైన అనేకమంది అభ్యుదయ రచయితలు మార్క్సిజం స్ఫూర్తితో ఆకర్షితులైన వారేనన్న వాస్తవం ఈ రాతల వల్ల చెరిగిపోదు. ఇలాంటి విపరీత వికృత విశ్లేషణలు వారి స్మృతికే అపచారం.

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్



## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# ధింసా దారిలో...



- ఎస్. బాలసుధాకర్ మౌళి

**సంక్రాంతి రోజులు**
**అడవంతా దట్టమైన చీకటి**
**కొండగాలి రివ్వున పల్లానికి వీస్తుంది**
**కొండంతా క్షణాల్లోనే చలి ముసురుకుంది**

మునగ, కాగు, సీతాఫలం, రామాఫలం చెట్లన్నీ చప్పుడు చెయ్యక బిర్ర బిగుసుకునున్నాయి.
ఒడిసి కంపల్లోకి పామేదో పాకింది గావాలా సర్రున అలికిడయ్యింది.
పై నుంచి చిన్న చిన్న చినుకులు
క్షణాల్లోనే వాన
రెండ్రోజుల నుంచి ఇలాగే పడుతుంది.
కొండజోలల్లో వేగం పెరిగింది. కొండల్లో ఏటా నీళ్ళుండేవి. ఏవైనా వున్నాయంటే అవి కొండజోలలే!
పాయలు పాయలుగా చీలి నీటిని పల్లానికి మోసుకెళ్తాయి.
గిరిజనులు నిత్యం నీరుండే కొండ జోలల దగ్గరే రెండు మూడెకరాల్లో వరి పంటని పండిస్తారు.
అక్కడ నీటికి కరువుండదు. పోడు వ్యవసాయానికి గిట్టుబాటవుతుంది. ఆరు, ఏడు బస్తాల పంటైనా చేతికొస్తుంది.
'పొద్దుబోయి సేనా సేపయ్యింది. ఈ మొండోన వొదిలేట్లునేదు. గుడిసికి గమ్మున ఎలిపోవల...'
వానలో తడుస్తూ దారికి అడ్డొచ్చిన వెదురుకొమ్మలను పక్కకు తొలగించి ముందుకెల్తన్నాడు బుదరయ్య.
ఊరెంతో దూరంలో లేదు.
పరిమి కంపలు, గచ్చి కంపలు కాలికి గుచ్చి సలపరం పెడుతున్నా మొండిగా వెళ్తున్నాడు.
వాన జోరందుకుంది.
సువ్వాయి కూడా జత కలిశాడు.

ఏ మూల నుంచో అడవి పంది మూల్గులు వినిపిస్తున్నాయి. అడవిలో ఎలుగులు, పందులు వాళ్ళకేమీ అసహజం కాదు. ఎదర నుంచే వెళ్తుంటాయి.

పొదలెంబడి రెండడుగులు నడిచారో, లేదో ఊరొచ్చేసింది.

'గుమిడిడూడ'

పది పన్నెండిళ్ళులుంటాయి. ఎనిమిది కొండ దొరలవి. మిగిలినవి గదబలవి. అందరూ గిరిపుత్రులే.

కొండే..వారి బతుకుల్లోకి తొంగిచూసే చీకటి వెల్గులకి సాక్షి.

కొండ భైరవుడు వాళ్ళ దేవుడు. సంతోషమొచ్చినా, కష్టమొచ్చినా మొదట చెప్పుకునేది కొండ భైరవుడికే.

బుదరయ్య దడి తోసుకొని ఇంటిలోకెళ్ళి ఓ మూలన కర్రల మోపును దించాడు.

గిరిజనులు దిగువ ఊర్లలో అమ్మడానికని కట్టెల్ని కూడబెడతారు. కానీ సంక్రమానం రోజుల్లో అమ్మరు. ఇంటి అవసరాలకే ఉపయోగించుకుంటారు.



'బుదరా! వోనల వడి యెల్లకపోతే కొంపలేటి మునిగినయిరా... పొయ్యిలోకి కంపలున్నయి గదేటి... ఊట్టమొత్తే మీ యయ్యుండని ధీమా...!'

వానలో పడొచ్చిన కొడుకుని దెబ్బలాడుతోంది భూదేవమ్మ. పద్దెనిమిదేళ్ళ బుదరయ్య మనసులో కొండ భైరవుడికి దణ్ణం పెట్టుకుని గోడకి చేరబడ్డాడు.

'భైరవడుండగా... నాకేటి కాదులే!' అన్నట్టు తల్లికేసి చూశాడు.

'అమ్మీ! ఏదిలగ వణ్ణం మెతుకులు.. ఇమ్మీ... సింత పిక్క పులుసున్నూ...' కేకేశాడు బుదరయ్య.

బుదరయ్య చెల్లెలు సుకిరి సిబ్బిలో అన్నం తెచ్చి వడ్డించింది. భూదేవమ్మ వెనుక గదిలో దీపం బుడ్డీని తిల్లు దగ్గరకు తీసుకొచ్చింది.

బయట తడికల్లోని మేకలు చలికి దగ్గరగా చేరి గునుస్తున్నాయి. మేక పిల్లలు లేత గొంతులతో నెమ్మదిగా అరుస్తున్నాయి.

వాన తగ్గింది.

చేటలో చెరిగిన మెత్తని పిండిలా... వెన్నెల పల్చగా కాస్తంది.

'ఒసే సుకిరీ..మనోలందర్నీ గుమ్మంలోకి పిలుసుకొచ్చి మీ...'

దీపం ఒత్తిని పైకెత్తుతున్న సుకిరిని దగ్గరికి పిలిచి చెప్పాడు ఈడ ఉంబయ్య.

సుకిరి ఉంబయ్యకి రెండో పెళ్ళాం కూతురు. బుదరుడు మొదటి పెళ్ళాం కొడుకు. భూదేవమ్మ సుకిరికి పెత్తల్లి. బుదరడికి కన్నతల్లి.

గూటిలో వున్న ఇంకో దీపం బుడ్డి తీసి వెలిగించింది సుకిరి.

'ఇదా... ఆ నాలుగిళ్ళ గదబోలికి సెప్పడం మర్సిపోకిమి' వెళ్తున్న సుకిరికి గుర్తుచేశాడు ఉంబయ్య.

ఎడమ చేత్తో బుడ్డీని ఎత్తి పట్టుకొని ముందుకి దారి చూపిస్తూ...ఇంటింటికీ వెళ్ళి 'అయ్య' రమ్మన్నాడని చెప్పుకొచ్చింది సుకిరి.

ఈడ ఉంబయ్య. ఆ కొండ ఊరికి రెండు తరాల నుంచి పెద్ద మనిషి. తగువులు, తంటాలు తీరుస్తాడు.

తేలు కుట్టినా, పాము కరిచినా పసరు పోస్తాడు. చూడ్డానికి మనిషి ఉబ్బిన పొట్టతో లావుగా, నల్లగా వుంటాడు.

చెవికెప్పుడూ బంగారు బావిలి వ్రేలాడుతుంటుంది. రెండు పిర్రల మధ్య గోచీ, మొలత్రాడుకి ఒక ప్రక్కన చుట్టలు పెట్టుకోవడానికో వెదురుగొట్టం. రెండో ప్రక్కన కత్తి పెట్టుకోవడానికో రెండు జానల పొడవుండే మరో గొట్టం. ఆత్మ రక్షణకి, జంతువులని వేటాడటానికి కత్తెప్పుడూ దగ్గరే పెట్టుకుంటాడు ఉంబయ్య. అడవికెళ్ళినా, వల్లపు ఊర్లకెళ్ళినా ఉంబయ్య వాలకం ఇంతే.

ఉంబయ్య కత్తిలాగే మాట కూడా పదును.

ఆ ఊరోల్లెప్పుడూ ఉంబయ్య మాటని జవదాటెరుగరు. కొండభైరవుడు పంపిన ఊరి రక్షకుడిగా ఉంబయ్యని నమ్ముతుంటారు వాళ్ళు. వాళ్ళ నమ్మకాన్ని వమ్ము చేయక ఎవరికే కష్టమొచ్చినా ముందుండింది ఉంబయ్యే.

పది నిమిషాల్లో ఆయా ఇళ్ళ యజమానులంతా ఉంబయ్య ఇంటికి చేరారు.

ముసురు వల్ల వచ్చిన చలిని తట్టుకోవడానికి దళసరి రగ్గులు కప్పుకొచ్చారు కొందరు. కొందరు పై మీద తువ్వాలు గుడ్డ ఒక్కటే వేసుకున్నారు.

గుమ్మంలో ఒక దగ్గర కూర్చున్నా రందరూ.

చేతిలో మునకాల కర్రతో నులుక మంచమ్మీద కూర్చున్న ఉంబయ్య అందర్నీ పలకరించాడు.

'గురులూ... సెప్పల్సింది సెప్పిద్దురూ బేగిల... సలికి దోవఁలు కరుతన్నయి'

గదబ గవరుడు భుజం మీద తువ్వాలు తీసి వీపు వెనక్కు విసురుకుంటున్నాడు.

ఉంబయ్య గొంతు సవరించాడు.

"మీకు తెల్వంది గాదు. సెంక్రమానంలో కనుమ రోజున మనం దిగువకు ఎల్తం. తాతల తండ్రుల కాంచి ఏటా సేత్తుందే...

పండగ తిల్లు కోసం ఎల్తన్నవన్నది పక్కనెట్టండి.

అటకన కూకున్న తుడుంలు, డప్పులు కిందికి దించెర్రు గదా...

ఈ పాటికే అగ్గిన ఎచ్చబెట్టుంట్రు... వొక పాల పలికించండి.

మన తుడుం దెబ్బకు పైసలు రాలాల. డప్పుల మోతకు పప్పులు కూడాల.

సూరీడు పొడిసే ఏళకి సిద్ధంకండి.

"కొండబవిరుడు సల్లగ సూడల"

భైరవుడికి నమస్కరిస్తూ చెప్పడం పూర్తి చేశాడు ఉంబయ్య.

ఆ మాట కోసమే కాచుక్కూచ్చున్న అంతా ఆనందంతో తలలు ఊపారు.

భూదేవమ్మ ప్రతీ ఒక్కరికీ 'టీ' నీళ్ళు అందించింది. సాధారణంగా గిరిజనులు పాలు కలిపిన టీని తీసుకోరు. బెల్లం కలిపిన తేనీరుని మాత్రమే తాగుతారు.

రేప్పొద్దుట గురించి మాట్లాడుకుంటూ అందరూ వారి వారి ఇళ్ళకు చేరుకున్నారు.

కొండ.

నాగరికతకు, అనాగరికతకు అడ్డుగోడ.



పల్లాన్ని, ఎగువుని స్పష్టంగా వేరు చేసే విభజన రేఖ. కొండ మీద పుట్టే ప్రతీది స్వచ్ఛమైనది. సహజమైనది. దూరం నుంచి నల్లగా, నున్నగా కనిపించే కొండ, దగ్గరికెళ్ళి చూస్తే ఏ చిత్రకారుడో ఆకుపచ్చని రంగుని దట్టంగా పూసినట్లుంటుంది.

దూరపు కొండలు నునుపుగానే కనిపించినా గిరిపుత్రుల బతుకులు మాత్రం అంతా ఎగుడు దిగుడులమయమే.

పల్లపోలంత జ్ఞానం లేదు వాళ్ళకి. తెలివీ లేదు. ఉన్నదొక్కటే మంచితనం. ఎవరినైనా నమ్మే అందమైన అమాయకత్వం.

కష్టాల్ని, ఇష్టాల్ని కలిపి పంచుకునే సామూహిక జీవన పరిమళత్వం.

సూరీడింకా చీకట్లోనే వున్నాడు.

తల్లి కోడి పిలల్ని రెక్కల్లో పొదుపుకుని హాయిగా సేదతీరుతున్నట్లు... కొండ బిడ్డలతో కొండ నిర్మలంగా నిద్రపోతుంది. రాత్రి నుంచి కురుస్తున్న మంచుకి ఆకుపచ్చని ఆకారాలన్నీ పాల నురగలాంటి తెల్లని చీరెను కట్టుకున్న గిరిజన స్త్రీల్లా కనిపిస్తున్నాయి.

మంచు కురుస్తోంది. నెమ్మదిగా చీకటి తెరలు తొలగిపోతున్నాయి. తీతువు వేకువపాట అందుకుంది. సూర్యుడు కొండ సిగన బంతి పువ్వై పోయాడు.

'తూర్పు' కొండ వాకిలికి సింధూరం పూసింది.

తొలి వెలుగులలో... కొండ, కొండ మీద ఊరు.

ఆకాశంలో చుక్కలు విసిరేయబడ్డట్లు స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఇష్టానికి తగ్గ ఇల్లులు.

ఇంటి గోడలుగా ఒడిసి కంపలు. కంపలకు అటు ఇటు ఒత్తుగా మెత్తిన కొండ మట్టి. ఇంటికి ప్రహరీగా వెదురు, బద్దల దడి, పై కప్పుగా చెరువులో పూసిన అగురు, తాటి కమ్మలు.

కొనుక్కున్నా చల్లదనమంతా కొండల్లో, కొండ బిడ్డల ఇళ్ళల్లోనే దొరుకుతుంది.

గిరిజనులు ఇళ్ళ దగ్గరే వ్యవసాయం చేస్తారు. గంటిలు, కొర్రలు, సామలు – నాగరికులు ఎప్పుడో మరచిపోయిన తిండి గింజలన్నీ ఒక్కసారిగా కళ్ళముందు కనిపించి పండగ చేస్తాయి. కాయగూరలతో నిండిన పెరడ్లు, సీతాఫలపు చెట్లతో గడపలు. దడికి అవతలి వైపు జీలుగు చెట్లు, తంగేడు పువ్వులు, అడవి మల్లెలతో మత్తుగా జోగుతున్న కొండ.

దానికి తోడు పక్షుల కువకువలు. సెలయేళ్ళ పరుగులు. ప్రపంచంలో సౌందర్యం అన్నదంతా కొండవట్టునే పోగుపడినట్లుంది.

సూర్య కిరణాల తాకిడికి మంచు కరిగి కరిగి నీరైపోయింది. ఏ అడవి కుమారుని గుండెల్నించో వేణుగానం సుళ్ళు తిరుగుతూ కొండల్లో ప్రతిధ్వనిస్తోంది.

ఉత్సాహపు రెక్కలు కట్టుకుంది ఊరు ఊరంతా.

ఈడ ఉంబయ్య ముందుకొచ్చి నిలబడ్డాడు. పసుపు రాసిన మిర్జీ గుడ్డతో తళ తళా మెరిసిపోతున్నాడు.

మిగిలిన మగవాళ్ళు కూడా వారి వారి కొత్తబట్టలు వేసుకుని ఒక పక్కకొచ్చి నిలబడ్డారు.

వాళ్ళ ముందు తుడుంలు, డప్పులు.

ఉంబయ్య చెప్పడం ప్రారంభించాడు.

"ఇయ్యేల కనుమ... మనం కిందకి ఎల్తన్నం. తిరిగొచ్చే యేళకి వోరం పట్టొచ్చు. పది దినాలు పట్టొచ్చు. అంత కడకి ఆడోలు యిల్లులను కాపల కాసుకుండాల... సంటి బిడ్డల తల్లులు బిడ్డల్ని సగ్గ సూసుకోవాల... కాలు, సేతులు రానోలు పెరడుకేసి ఓ కన్నేసుంచాల.. మేకలు జాగ్రత్త... పాదులు జాగ్రత్త.. కుక్కలెలగు తోడుంటయి..."

అంటూ గొంతు హెచ్చింది...

"పల్లపోల సెడి బుద్ధులను నేర్సి కొండకు మోసుకు రాగూడదు. మన సెంప్రదాయకాలకి తూట్లు పొడగూడదు..." తనతో పాటు కిందకొచ్చే సహచరులకు ఒక హెచ్చరికలాంటిది చేశాడు.

దిగువకు దిగే ముందు ఇవ్వాల్సిన సూచనలన్నీ ఇచ్చాడు ఉంబయ్య.



## మార్చి నెల పురస్కారాలు

### ఒయాసిస్సులు
కథకు........రూ.700/-

రచయిత : డా॥ శాంతి నారాయణ

### గజల్
కవితకు.......రూ.500/-

రచయిత : డా॥ ఎం.బి.డి. శ్యామల

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

చివరగా "సల్లగ సూడల తండ్రీ..!" గుండెలదిరేలా డప్పు వాయిస్తూ కొండ భైరవుడికి ఒక దణ్ణం పెట్టుకున్నాడు. మిగిలినోలంతా అలాగే చేశారు.

ఆడోళ్ళంతా ఒకరి చేతిని ఒకరు పట్టుకుని జట్టు కట్టి... 'వొచ్చే వరకు అందరం గుట్టుగా వుంటామని..' వాళ్ళ వాళ్ళ పురుషుల కళ్ళలోకి చూస్తూ మాటిచ్చారు.

మగవాళ్ళు తుడుంలు, డప్పులు, పినలగర్రలు, సంచులు పట్టుకుని కొండ మీద నుంచి దిగువకు బయలుదేరారు. జీలుగు కల్లు నింపిన ఆనభ డొల్లల్ని కూడా వెంట తీసుకెళ్తన్నారు.



గుమిడిగూడ నుంచి దిగువకు వెళ్ళాలన్నా, దిగువ నుంచి గుమిడిగూడకి రావాలన్నా ఒక్కటే దారి. రెండు గాటీలు దాటాలి. గాటీలని ఆనుకొని తుప్పలు, అడవి మల్లె పొదలు, వెదురు మొక్కలు...

అంతా ఒక వరుసగా ఒకరి వెనుక ఒకరు నడుస్తున్నారు.

ఉంబయ్య ముందు నడుస్తున్నాడు.

రెండు గంటలు గడిచింది.

ఎదురుగా పల్లపు నేల.

అడవి బిడ్డల అమలిన స్పర్శకు నేల నేలంతా పసుపు రాసుకున్నట్టుంది.

పక్కనే నీటిపాయలన్నీ కలిసి ఏర్పడిన పెద్ద గెడ్డ పారుతుంది.

దాహం తీర్చుకున్నారంతా...

ఊర్లోకి పయనం కట్టారు..

ఉద్దంగి...

కొండకి దగ్గర్లో వున్న చిన్న పల్లెటూరు.

మామిడి, జీడి తోటలతో పచ్చగా కళకళలాడుతోంది.

కొండ పుత్రులు తోట వెంబడి నడుస్తూ ఊర్లోకి అడుగుపెట్టారు.

ఆహ్వానించిన వీధి దగ్గర ఆగారు.

ఏటేటా వచ్చే కొండ బిడ్డలని చూసి ఊరు సందడి పడింది.

గిరిపుత్రుల పాదాల్లో మత్తుగా ఊగే థింసాని చూడాలని, ప్రకృతి ఒడిలో ప్రాణం పోసుకున్న వేణుగానాన్ని వినాలని ఊరి కళాభిరుచి ఉప్పొంగింది.

ఉంబయ్య - చెవి బావిలి గాలికి ఊగుతుండగా ఆనభడొల్ల ఎత్తిబెట్టి జీలుగు కల్లు తాగాడు. తుడుం మీద ఉంబయ్య చేతికర్ర సమ్మోహనాభరితంగా నాట్యం చేస్తోంది.

'టముక టమా... టముక టమా... టముక టమా..'

తుడుం దెబ్బకు వీధి వీధంతా తడిసి ముద్దైంది.

'జజ్జనికరి... జజ్జనికరి... జజ్జనికరి...'

డప్పుల హోరులో ఊరు ఊరంతా థింసా ఆడింది.

బియ్యం, కూరలు, బూరెలు, గారెలు ఒకటా రెండా!

మురిసిపోయారు అడవి బిడ్డలు..

కొండ గుర్తొచ్చింది గావాల...

కన్నీరు కార్చేరు.

బతుకు దాహార్తిని తీర్చుకోవడానికి... థింసాని నమ్ముకుంటూ... మరో ఊరు కదిలిపోతూ...

సంప్రదాయాన్ని కొనసాగించే దారుల్లో కొండబిడ్డలు.

■

# తెలుగు ప్రజలతో బ్రౌను అనుబంధం


(సి.పి. బ్రౌన్ - 1798-1884)

- డా॥ పి. సుమతీదేవి

బ్రౌను దొరకు సంబంధించిన సమాచారమేదైనా అది సాహిత్యపరమైందైనా, వ్యక్తిగతమైందైనా మనకు విశదపరిచే మూలాధారాలు రెండే రెండు. బ్రౌను సేకరించి భద్రపరిచిన లేఖలు మొదటిది కాగా తాను రాసుకున్న సాహిత్య స్వీయ చరిత్ర రెండవది.

ధన సంపాదనమే ధ్యేయంగా భారతీయులను పీల్చి పిప్పి చేయాలన్న సంకల్పంతో ఏర్పడిన ఈస్టిండియా కంపెనీ సివిల్ ఉద్యోగిగా మన దేశంలో అడుగు పెట్టిన ఆంగ్లేయుడు బ్రౌన్. సహోద్యోగులలో ఎక్కువమంది నీతి నియమాలను నీళ్ళకొదిలేసినవారు. అటువంటి పరిస్థితుల్లో కొంగల్లో హంసలాగా వ్యవహరించిన కొందరు ఉద్యోగులు లేకపోలేదు. ఆ కొందరిలో ఒకడిగా, తెలుగువారి చేత అభినందింప బడ్డాడు బ్రౌను దొర.

ఇంచుమించు నాలుగు దశాబ్దాల పాటు తెలుగువారి నడుమ గడిపిన బ్రౌను దొరకు వారి విషయమై వున్న భావాలను వారితో ఆయనకున్న సాన్నిహిత్యాన్ని, ఆ ప్రజలకు ఆయనపై ఉన్న గౌరవాభిమానాన్ని తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

తను నిర్వహించే ఉద్యోగ ధర్మాన్ని బట్టి ఆయనకు ప్రజలతో ఎక్కువ పరిచయముండటం ఉచితం కాదు. న్యాయస్థానంలో విచారణ సలిపి న్యాయాన్యాయ నిర్ణయం చేయాల్సిన ఆయన సమాజంలో విశేషంగా తిరగడం తగనిపని. ఈ పరిస్థితులు ప్రజల కాయనను కొంత దూరం చేసినా, బ్రౌను దొర దగ్గర న్యాయం దొరుకును అని ప్రజలలో ఉండటం వలన ఆయనకు ఆర్తులెందరో జాబులు రాసుకునేవారు. వాటినన్నింటిని సావధానంగా పరిశీలించి బ్రౌను దొర న్యాయం చేసేవాడు.

ఈ జాబులు రాసిన వారిలో పండితులు, పామరులు, కంపెనీ ఉద్యోగులైన తెలుగువారు ఆయనకు సలహాలను చెప్పు చిన్న ఉద్యోగులు, వర్తకులు, యాచకులు - అందరూ ఉన్నారు. ఆనాటి తెలుగు పండితులందరితోను బ్రౌను దొరకు పరిచయముండేది. వారిలో ఉత్తములను తన పండితులుగా నియమించుకున్నాడు బ్రౌను దొర.

బ్రౌను దొరకు వచ్చే విన్నపాలలో ఎక్కువ భాగము - 'ఏదైనా ఉద్యోగమిప్పించవలెను అనేవే ఉండేవి. మీరు తలచుకున్నచో నాకు వివాహమగును' అని వేడుకున్నవారు కూడా ఉన్నారంటే నాటి తెలుగు ప్రజలు బ్రౌను దొరను ఎంత ఆత్మీయంగా భావించేవారో తెలుస్తుంది.

బ్రౌను దొరకు ప్రజలలో అనుబంధం ఎక్కువభాగం అర్జీల రూపంలోనే వుండేది. అర్జీదారులలో యోగ్యులైన వారికెందరికో బ్రౌను దొర ఉద్యోగాలిచ్చి ఆదుకొనేవాడు. వర్తకులలో చిన్న ఉద్యోగులలో, రైతులలో బ్రౌను దొర యోగ్యుడైన ఉద్యోగి అని పేరు పడింది. న్యాయాధికారిగా గూడా బ్రౌను దొరకు మంచి పేరు ప్రతిష్టలుండేవి.

అవినీతిపరులైన కింది ఉద్యోగులు బ్రౌను పేరు విన్నంతనే ఉలిక్కిపడేవారు. తాము తీసుకున్న లంచం మొత్తం తిరిగి ఇచ్చేవారు. మట్టపల్లి భగవానులు అనే గుంటూరు వ్యాపారి తనను చిన్న ఉద్యోగులు లంచం కొరకు వేధించే విషయాన్ని అర్జీ రూపంలో బ్రౌనుకు యీ విధంగా విన్నవించుకున్నాడు.

'ఇప్పుడు పేష్కారు నన్ను వర్తకం చేసుకోకుండా సకల నిర్బంధములు పెట్టుతూ నిర్హేతుకముగా నా దగ్గర ఒక అర్ధ రూపాయి కూడా అపరాధము పుచ్చుకుని తమరు విజయం చేస్తారని తెలిసి, నిన్న ఆ అర్ధరూపాయి మళ్ళీ నాకు ఇచ్చివేసినాడు.'

దీనికి తోడు ఆయనకు దేశీయ భాషా సాహిత్యమునందు గల ప్రీతి, పాండిత్యము కూడా తెలుగు ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

గుణవంతులైన పండిత పామరులందరును బ్రౌను దొర యొక్క ఆదరాభిమానాలను చూరగొన్నవారే. దేశీయుల ఆచార వ్యవహారాలను, సాహిత్య సంస్కృతులను బాగా గ్రహించి అర్థం చేసుకొని తమ ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించుకొన్న నాటి పాశ్చాత్యులలో బ్రౌను దొరగారే అగ్రగణ్యుడు.

జమిందారులు క్షామ పరిస్థితులు ఎదురైనప్పుడు పేష్కషు చెల్లించలేమని, దయ చూపించాల్సిందని స్వయంగానో వకీలు ద్వారానో వినతిపత్రం పంపుకొనేవారు.

సామాన్యులు రాసుకొనే పత్రాలలో బ్రౌను దొర మానవ కారుణ్య దృష్టిని, తెలుగు సాహిత్యాల పట్ల ఆయనకు గల శ్రద్ధాసక్తులను గురించి రాసుకొనేవారు. చదువుకున్న పేదవారికి బ్రౌను సులభుడు, చదువురాని ధనవంతులు ఆయన వద్దకు వెళ్ళడానికి జంకేవారు.

తమ కష్టసుఖాలనే గాక వారి గృహచ్ఛిద్రాలు గూర్చి కూడా బ్రౌనుకు లేఖల ద్వారా తెలుపుతూ అతని సమాధానాల కొరకు ఎదురు చూసేవారు. ఆంధ్ర దేశంలోని వివిధ ప్రాంతాల వారు 'బ్రౌన్ తమ

జిల్లాలకు ఎప్పుడు ఉద్యోగిగా వచ్చునా, ఎప్పుడాయన పెద్ద ఉద్యోగి అగునా, అశ్రితులకు ఉపకారములు జరుగునా అని నిరీక్షించెడి వారన్నచో ఆయన మీద తెలుగు ప్రజలకు గల ఆదరాభిమానాలే పాటివో తెలుస్తుంది.

'పాండిత్యం గల వారంతా సహృదయులు కాలేరు. అలాగే సహృదయులందరూ విద్వాంసులు కాలేరు. కాని బ్రౌను దొరలో పాండిత్యము సహృదయత జంట కవులై పొరపొచ్చెములు లేకుండా, క్షీరోదకముల వలె కలిసి మెలిసి ఉండటం గొప్ప విషయం. పాండిత్యం ఆయనకు పండిత లోకంలో పెద్ద పీట వేస్తే, సహృదయం ఆయనకు ప్రజల హృదయాలలో పట్టుపరుపు పరిచింది. సహృదయత్వం లోపించిన పాండిత్యం నిర్గంధ కుసుమం, ఈ దృష్టితో చూస్తే బ్రౌను దొర సమున్నతుడైన వ్యక్తిగా, మూర్తీభవించిన ఔదార్యంగా రూపుదాల్చిన సౌజన్యంగా దర్శనమిస్తాడు." **- డా॥ చల్లా రాధాకృష్ణశర్మ, సి.పి. బ్రౌన్ సాహిత్యనేత (పి.77).**

తాను తలపెట్టిన సాహిత్య యజ్ఞానికి పండితుల, తాళపత్ర గ్రంథాలున్న వ్యక్తుల, గ్రంథాలయముల సాయము అనివార్యమని మొట్టమొదటనే గుర్తించిన బ్రౌను దొర ఆ పండితులకు స్నేహితుడు, పోషకుడు అయ్యాడు. ఆ రోజుల్లో పండితుల నాదరించే వారే కరువవ్వటం చేత వారికి బ్రౌను దొర దేవుడు అయ్యాడు. ఆయన దగ్గర పండితులుగా చేరడానికి ఆనందంగా అంగీకరించడమే గాకుండా, శక్తివంచన లేకుండా సేవ చేసేవాళ్ళు. ఈ సేవలో వారికొక ఆనందం తమ భాషా సాహిత్య పునరుజ్జీవనానికి తాము కూడా భాగస్వాములవుతున్నందుకు సంతోషించారు. పండిత పక్షపాతియైన బ్రౌను దొర వారి పాండిత్యాన్ని, వినయ విధేయతలను అనేక సందర్భాలలో పేర్కొన్నాడు. ఒక విధంగా 'పరస్పరం భావయంతః' అన్నట్లయింది. అయితే ఆనాటి పండితుల దీనస్థితిని గూర్చి - మనం మన సేవకులకు ఇచ్చునంతటి తక్కువ జీతానికే పండితులు కూడా లభించేవారు' అని విచారించాడు బ్రౌను దొర.

**'పాండిత్యం గల వారంతా సహృదయులు కాలేరు. అలాగే సహృదయులందరూ విద్వాంసులు కాలేరు. కాని బ్రౌను దొరలో పాండిత్యము సహృదయత జంట కవులై పొరపొచ్చెములు లేకుండా, క్షీరోదకముల వలె కలిసి మెలిసి ఉండటం గొప్ప విషయం. పాండిత్యం ఆయనకు పండిత లోకంలో పెద్ద పీట వేస్తే, సహృదయం ఆయనకు ప్రజల హృదయాలలో పట్టుపరుపు పరిచింది.**

తెలుగు భాషా సాహిత్య సముద్ధరణలో బ్రౌను దొరకు సాయపడిన తెలుగు ప్రజలలో - పండితులుండిరి, పామరులుండిరి, జమిందారులుండిరి, సామాన్య సేవకులుండిరి, గ్రామ కరణాలుండిరి, కంపెనీ ఉద్యోగులుండిరి, సొంతంగా ఆయన దగ్గర జీతాలు తీసుకొని పనిచేయు వారుండిరి. జీవనోపాధి యుండి ఆయనకు సాయపడిన వారుండిరి - అన్ని తరగతుల వారుండిరి.

కోర్టు వ్యవహారాలలో సంబంధమున్న పండితులు వఠ్యం అద్వైత బ్రహ్మయ్య శాస్త్రి వంటివారు, ఉన్నతోద్యోగులైన పండిత మిత్రులు ఏనుగుల వీరాస్వామయ్య వంటివారు, విద్యావంతులై స్వంతంగా ముద్రణాది వృత్తులు చేపట్టి బ్రౌను దొర సాయమును పొందుచుండెడి వర్తమాన తరంగిణి ప్రొప్రయిటర్ పువ్వాడ వెంకటరావు వంటివారు, బ్రౌను దొర దగ్గర జీతాలు తీసుకొని తెలుగు కావ్యాదులకు వ్యాఖ్యానాలు రాసే మహా విద్వాంసులైన జూలూరి అప్పయ్య శాస్త్రుల వంటి వారు, తరువాతి కాలంలో వైయాకరణ సార్వభౌమునిగా కీర్తి పొంది నాటి నుండి నేటి వరకు గ్రాంధికాంధ్రాన్ని శాసిస్తున్న పరవస్తు చిన్నయ్యసూరి వంటి విద్వాంసులు, విద్వచ్ఛిఖామణులైన, హాస్యప్రియులైన తిరుపతి తాతాచార్యులు వంటివారు, గ్రంథ సేకరణలో సాయపడిన గుండవరం కృష్ణయ్య వంటివారు, అంకాలు వంటి వ్రాయసగాండ్రు - బ్రౌను దొర పండితులను, పనివారిని, సంబంధమున్న ఇతరులను, ఆయన ఆస్తిపాస్తులను, అప్పుసప్పులను - అందరిని, అన్నింటిని ఉచిత రీతిని పర్యవేక్షిస్తూ దొరగారికి తలలో నాలుకవలె వ్యవహరించిన కార్య నిర్వాహకదక్షుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి వంటివారు - ఎందరో బ్రౌను దొరకు సమీపవర్తులై యుండిరి. వీరందరూ లేకపోయినచో బ్రౌను దొర పనిచేయలేక పోయెడివాడు. బ్రౌను దొర నాయకత్వం లేకపోతే వీరందరూ నిర్వ్యాపారులు, నిష్క్రియాపరులై పోయేవారు.

అందర్ని గురించి చెప్పుకోవడం అసాధ్యం. కొందర్ని గురించైనా తెలుసుకోవడం అవసరం. అప్పుడు గాని వారి మధ్యనున్న అనుబంధం అభివ్యక్తమవదు.

1817లో మొట్టమొదటిగా బ్రౌను దొరకు తెలుగు అక్షరాలు నేర్పిన ఘనత వెలగపూడి కోదండరామయ్య పంతులు గారిది. కోదండరామయ్య పంతులు చలువ వలన బ్రౌను దొరకు వేదండము నెక్కినంత కీర్తి లభించింది. కాలాంతరంలో ఈ పంతులు గారికి బ్రౌను దొర పోలీసు శాఖలో ఉద్యోగమిప్పించి తన గురు రుణాన్ని కొంత తీర్చుకొన్నట్టుగా బ్రౌను దొర రాసిన రాతవల్లనే తెలుస్తోంది.

వీరి తరువాత తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మ శాస్త్రి గారలు బ్రౌను దొరకు భాష, వ్యాకరణం, ఛందస్సు అధ్యయనం చేయించినట్లు 'వేమన పద్యాలు' - అనే తన పుస్తకపు పీఠికలో బ్రౌను దొర తెలిపాడు.

తిప్పాభట్ల వెంకట శివశాస్త్రిగారు బ్రౌను దొరకు ఛందస్సు వ్యాకరణము మొదలయినవి చెప్పడమే గాక వేమన పద్యాలకు వివరణ రాయుటలోను కవి జనాశ్రయాన్ని తీర్చిదిద్దడంలో కూడా సాయపడినట్లు తెలుస్తున్నది. బందరు వాస్తవ్యుడైన ఈయన బ్రౌన్ దొరకు 1822 నుండి (బ్రౌను దొర బందరులో పనిచేసిన రోజులు) తెలియునని 1824లో 'మేడికోలు' శబ్దార్థానికి వీరి నడుమ సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలను బట్టి తెలుస్తోంది.

వఠ్యం అద్వైత బ్రహ్మ శాస్త్రి గారు బ్రౌను దొరకు అత్యంత సన్నిహితుడు. బందరు కోర్టులో బ్రౌను దొర పనిచేసినపుడే ఈయన

అక్కడ కోర్టు పండితునిగా పనిలో ఉండేవాడు. కాలక్రమంలో మద్రాసులోని 'అదాలతు కోర్టు పండితునిగా' అభివృద్ధి పొందాడు.

బ్రౌను దొరకు గురువుగా, ఆప్తమిత్రునిగా, లిఖిత ప్రతులను సేకరించుటలో వివిధ భారతీయ లిపులలో వున్న సంస్కృత గ్రంథాలను తెలుగు లిపిలో రాయించి బ్రౌను దొరకు అందజేయుటలో సహాయకునిగా, బ్రౌను దొర ముద్రించుచుండెడి గ్రంథ ముద్రణ పర్యవేక్షకునిగా, శశాంక విజయ, దశావతార చరిత్రల గ్రంథ పరిష్కర్తగా బ్రహ్మయ్య శాస్త్రిగారు వ్యవహరించారు.

ఈతనిని బ్రౌను దొర "My Very learned friend Bramhiya" అని పలుమార్లు పేర్కొన్నాడు. చదివితే (వింటే) భారతమే చదవాలి (వినాలి) అని ఇతడు పదే పదే బ్రౌను దొరకు చెప్పుచూ వచ్చినట్లు దొరగారు రాసిన "Bramhiya begs me to read the Bharatham first" అను దానివలన తెలుస్తోంది. బ్రౌను దొరగారి 'ఆంధ్ర గీర్వాణి చ్ఛందము'లోని 'శకట రేఫసాధు రేఫల నిర్ణయము' వత్యం వారి రచనే. వీరు 1840లో కీర్తిశేషులయ్యారు.

బ్రౌను దొరగారి గౌరవ మర్యాదలను పుష్కలంగా పొందిన మరొక పండితుడు రావిపాటి గురుమూర్తి శాస్త్రి. తన పాండిత్యంతో అధ్యాపక వృత్తిని స్వీకరించి ఫోర్టు సెయింటు జార్జి కళాశాలలో తెలుగు పండితునిగా 1816 చేరి 1822లో తెలుగు ప్రధానోపాధ్యాయుడై, 1835లో దివంగతుడగు వరకును పనిచేశాడు.

పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన విద్యా విధానాన్ననుసరించి శాస్త్రిగారు వచన రచనలు చేసి వ్యాకరణం రచించి తరువాతి తరం వారికి మార్గదర్శకుడయ్యాడు. ఈయన రచించి ముద్రించిన విక్రమార్కుని కథలు (1819) - 1828, 1850, 1858 సంవత్సరాల్లో కూడా ముద్రింపబడ్డాయి. ఈ కథల ప్రతులను 450 ఆనాటి ఉద్యోగుల నిమిత్తం ఇంగ్లండుకు పంపారట. దాని తరువాత 1834లో వీరు రచించి ప్రకటించిన సంస్కృతము విష్ణుశర్మ కృత పంచతంత్రమునకు వచనాను వాదము. పై పుస్తకాలు రెండును కాలేజీ ప్రెస్సులోనే అచ్చయినాయి. ఈ తెలుగు పంచతంత్రం 1834, 1842, 1848, 1864, 1869 సంవత్సరాలలో అయిదుసార్లు అచ్చయింది.

ఆ కాలంలో రావిపాటి శాస్త్రిగారికి పేరు ప్రతిష్టలను తెచ్చిపెట్టింది వారి తెలుగు వ్యాకరణం. ఇది 1836లో అచ్చయి, కాంబెల్ దొరగారికి అంకితమివ్వబడింది. వ్యావహారిక రూపములకు గతి కల్పించడం యీ వ్యాకరణంలోని విశేషం. వ్యావహారిక భాషకు గల ప్రాముఖ్యాన్ని గుర్తించి ఆ భాషలో వచన రచనలు వ్యాకరణము చేయడమే గాక ముద్రణాదికాల్లో కూడా శాస్త్రిగారు ఆనాటికి ఆధునికమైన పద్ధతులను అంగీకరించారు. ఇన్ని విధాలుగా బ్రౌను దొరకు అభిమాన పాత్రుడు గనుకనే, వ్యావహారిక భాషాభిమానియైన బ్రౌన్ దొర తన "Essay on Telugu Literature" లో శాస్త్రిగారి ప్రస్తావన సందర్భంలో "... I mention his name because his talents learning and good sense always entitled his judgement and respect" అని ప్రశంసించాడు.

**ఉద్యోగ ధర్మాన్ననుసరించి జిల్లాలలో తిరగడం వల్ల ప్రజల మంచి చెడ్డల్ని, పండితుల పాండిత్యపు లోతుపాతుల్ని బ్రౌను బాగా గ్రహించగలిగాడు. వివిధ కోణాల్నించి విపులంగా వివరించేవి బ్రౌను దొర సేకరించిన జాబులు. ఈ జాబుల వల్లే నాటి భాషా విశేషాలు, సామాజిక ఆర్థిక పరిస్థితులు, బ్రౌను దొర వ్యక్తిగత విషయాలు, పేదవారి విషయంలో బ్రౌను దొర వ్యవహరించిన తీరులు, అధికారులకు, తాబేదారులకు మధ్య నున్న సంబంధాలు, పండితులకు ఆయనకు నడుమనున్న అనుకూలతలు, వ్యతిరేకతలు మొదలైనవన్నీ తెలుస్తాయి.**

ఆనాటి ప్రముఖులైన తెలుగు వారిలో ఏనుగుల వీరాస్వామయ్యగారు (1780 - 1836) ఉన్నత ప్రభుత్వోద్యోగి, బహుభాషా కోవిదుడు. తాను చేసిన కాశీయాత్రను వర్ణిస్తూ రాసిన లేఖలను ఈతని మిత్రుడు కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళెగారు 1838లో 'కాశీయాత్ర చరిత్ర' అను పేర ముద్రించి ప్రచారంలోకి తెచ్చారు. బ్రౌను దొరకు గ్రంథ సేకరణాదులలో సాయపడిన మిత్రులు వీరాస్వామయ్యగారు.

ఆ రోజుల్లో ప్రసిద్ధికెక్కిన ముద్రాక్షరశాలల్లో వర్తమాన తరంగిణి ఒకటి. దీని అధిపతి పువ్వాడ వెంకటరావుగారు "వర్తమాన తరంగిణి" పేరుతోనే ఒక పత్రిక కూడా యీయన సంపాదకత్వంలో వెలువడేది. 1842 నుండి 1877 వరకు వెంకటరావుగారే ఈ పత్రికకు ముద్రాక్షరశాలకు యజమానులుగానున్నారు. పువ్వాడ బ్రౌనుదొరల మధ్య స్నేహం చాలాకాలం వర్ధిల్లింది.

తెలుగువారితో కలిసి ఇంచుమించు నాలుగు దశాబ్దాలు వ్యవహరించిన బ్రౌను దొరకు ప్రజల ఆచార వ్యవహారాల గురించి కూడా బాగా తెలియును. తెలిసిన వాటిని ఆచరణలో పెట్టినవాడు. 1828 ప్రాంతాల్లో బ్రౌను దొర కడపలో పనిచేస్తూ ఉండేవాడు. కడప సమీపంలోని ఒక బ్రాహ్మణ కుటుంబంలో సహగమనం జరగబోతున్నట్లు విన్నాడు. స్వయంగా స్మశాన వాటికకు వెళ్ళి తన ఎదుటనే శవదహనం జరిపించి ఒక స్త్రీ ప్రాణాలు కాపాడాడు. మన సంప్రదాయం తెలియని పాశ్చాత్యులకు తన గ్రంథాలలో ప్రాసంగికంగా తెలుగువారి సంప్రదాయాలను గూర్చి బ్రౌను దొర చెప్పేవాడు. దీనికి తార్కాణంగా 'ఎంగిలి మాటలు' అను ప్రయోగాన్ని గూర్చి తన తెలుగు వ్యాకరణంలో ఫుట్‌నోట్‌లో : హిందువులు ఎంగిలిని అసహ్యించుకొందురు గనుక పెన్సిల్ గాని పెన్ గాని నోటికి తగలనీయరు - అని రాసిన వాటిని బట్టి గ్రహించవచ్చు. ఎవరైనా గాని ఇతర మతాల్ని గాని, వారి విశ్వాసాల్ని గాని దూషింపకుండా తమ తమ మత ప్రచారాల్ని చేసుకోవచ్చుననే నమ్మకమున్నవాడు బ్రౌను దొర. ఈ నమ్మకంతోనే ఆయన పురుషోత్తమ చౌదరిగారు రాసిన 'నిస్తర రత్నాకరము' అనే గ్రంథంలో క్రైస్తవ మత ధర్మములను వివరిస్తూ - హిందూ మత ధర్మములను - అవతారములను, ఆచార వ్యవహారములను - అతి తీవ్ర స్థాయిలో నిరసించి ఖండించు కీర్తనలు, పద్యాలు గల ఈ గ్రంథాన్ని ముద్రించేటప్పుడు ఇందులో గల హిందూ మత దూషణలను తాను తొలగించి అచ్చు వేసినట్లు బ్రౌన్ దొర చెప్పుకొన్నాడు.

# బాల్యానికి భరోసా

- ఆవుల జయప్రద

హద్దులు మీరిన ఏ వాంఛకో
ప్రతీక ఆ బాల్యం
అమ్మ ఒడిని కాకుండా
ముళ్ళ పొదలను చేరింది
స్తన్యం రుచి చూడాలని
అందరి వైపూ ఆర్తిగా చూస్తూ
రోదిస్తోంది దీనంగా
ఆ పసికూనకు తెలియదు యిప్పుడు
బాల్యం గుడి మెట్ల మీద, సందు
మలుపుల్లో బస్టాండు చప్టాల పైన
విరివిగా దొరుకుతోందని..
బాల్యం యిప్పుడు పోటీపడుతోందని
వీధి కుక్కలతోనూ, చెత్తకుప్పలతోనూ
ఎంగిలి మెతుకులకు, విసిరేసిన ప్లాస్టిక్ సంచులకు
బాల్యం యిప్పుడు భారమైందని




లగేజీలు మోసుకుంటూ, చిత్తు కాగితాలేరుకుంటూ
కర్మాగారాల్లోనూ, బొగ్గు గనుల్లోనూ
నాఫ్తలీన్‌లా ఉత్పాతనమవుతోందని..
బాల్యం యిప్పుడు పూదోటలా కాలుతోందని
కమ్మర కొలుముల్లో, ఇటుకల బట్టీల్లో
మేఘమాలికల్లా ఆవిరవుతోందని...
అరమరికలు తెలియని
పసితనానికిన్ని శాపాలా??
ఆశ్వయుజంలో గడ్డిపూలపై వాలే
సీతాకోక చిలుకల్లా
తూనీగ రెక్కలు మోసుకొచ్చే
పుప్పొడి రేణువుల్లా...
పంట చేలల్లో బెదిరిపోయే జింకల గుంపుల్లా..
సున్నితమైన బాల్యానికేది భరోసా??
జారిపోతున్న బాల్యాన్ని దోసిట్లో
దాచి కానుకగా ఇవ్వగలమా??
నిర్వీర్యమైపోతున్న బాల్యాన్ని
తిరిగి రప్పించగలమా??
అపురూపమైన బాల్యానికేది
ఎవరిస్తారు భరోసా?!!

---

ఉత్తమ క్రైస్తవుడై యావజ్జీవితము ఆ క్రైస్తవ మత ప్రచారానికై శ్రమించిన రెవరెండు డేవిడ్ బ్రౌను కుమారుడైన బ్రౌను దొర చేసిన ఈ పని అతని హృదయ వైశాల్యానికి అద్దం పడుతుంది. బ్రౌన్ దొరకు క్రైస్తవ మతమందు గాఢాభినివేశమున్నా గాని, తన పదవిని మత ప్రచార సాధనముగా చేసికొనలేదు.

భారతీయులు ఇంగ్లీషు వారు ఒకరి భాషను ఒకరు నేర్చుకొని పరస్పరము అర్థము చేసుకొనిన గాని ఇరువురి నడుమ సౌహార్ధము పెంపొందదనీ, అట్లర్థము చేసికొనుటకు తన రచనలే మాత్రమూ సాయపడినను, తాను కృతార్థత చెందినట్లేయని బ్రౌను దొర భావించాడు. తెలుగు వారికి సాయము చేయాలనే దృష్టి బ్రౌనుకు మొదట్నుంచీ ఉంది. అందుకే ఆయన తన గ్రంథాలలో చాలా భాగం రచించాడు. అవి తెలుగువారికి ఆంగ్లాన్ని ఇంగ్లీషు వారికి తెలుగును నేర్చుకొనుటకు వీలుగా ఉండాలని ఆయన ఉద్దేశం. ఇట్లు తెలుగు వారికి, ఇంగ్లీషు వారికి కూడ పనికి వచ్చునట్టి గ్రంథాలను రాయడమే గాక తెలుగువారి కొరకై బడులను కూడా బ్రౌను దొర స్థాపించాడు. ఈ బడులలో తెలుగు హిందూస్థానీ, పార్సీ భాషలు నేర్పబడేవి. 1821లో కడపలో రెండు పాఠశాలలు, 1823లో మచిలీపట్నంలో రెండు పాఠశాలలు, 1844లో మద్రాసులో ఒక ధర్మబడి స్థాపించబడ్డాయి. బ్రౌను దొర స్థాపించిన ఈ పాఠశాలలు పేద పిల్లలు చదువుకోవడానికి చాలా పనికి వచ్చేవి. ముఖ్యంగా ఇంగ్లీషు చదువుకోవాలనే తెలుగు వారికి బాగా సాయపడ్డాయి. ఈ ఇంగ్లీషు చదువు కొరకు ఆ రోజుల్లో బాలురు ఎంత శ్రమపడేవారో ఎంతెంత దూరం పొయ్యేవారో బ్రౌను దొరకు వచ్చిన జాబుల్ని బట్టి తెలుస్తుంది. బ్రౌన్ దొర స్థాపించిన ఈ బళ్ళలో ఉచిత బోధనతో పాటు ఉచిత భోజన వసతి కూడా కల్పించబడ్డం విశేషం. ఈ పాఠశాల స్థాపన ద్వారా బ్రౌను దొర తెలుగువారిలో నూతన తేజాన్ని పెంపొందించాడు.

ఉద్యోగ ధర్మాన్ననుసరించి జిల్లాలలో తిరగడం వల్ల ప్రజల మంచి చెడ్డల్ని, పండితుల పాండిత్యపు లోతుపాతుల్ని బ్రౌను బాగా గ్రహించగలిగాడు. వివిధ కోణాల్నించి విపులంగా వివరించేవి బ్రౌను దొర సేకరించిన జాబులు. ఈ జాబుల వల్లే నాటి భాషా విశేషాలు, సామాజిక ఆర్థిక పరిస్థితులు, బ్రౌను దొర వ్యక్తిగత విషయాలు, పేదవారి విషయంలో బ్రౌను దొర వ్యవహరించిన తీరులు, అధికారులకు, తాబేదారులకు మధ్య నున్న సంబంధాలు, పండితులకు ఆయనకు నడుమనున్న అనుకూలతలు, వ్యతిరేకతలు మొదలైనవన్నీ తెలుస్తాయి. బ్రౌను దొర 1838లో ఇండియాకు తిరిగి వచ్చినప్పటి నుండి వివిధ ఉద్యోగాల్లో మద్రాసులోనే ఉన్నాడు. పండితులు, తీర్పరుల వ్రాయసగాండ్రు, మొకాబిలాదార్లు, గ్రంథ సేకరణదార్లు, ఇతర సేవకులు - అందరూ గాని కొందరు గాని ఆయన జీతము మీద బ్రతుకుచు ఆయన ఆశ్రితులుగా ఇంచుమించుగా చివరి వరకు అనగా ఆయన 1855లో మన దేశాన్ని విడిచి శాశ్వతంగా స్వదేశానికి తిరిగి వెళ్ళే వరకు ఆయన వెంటే ఉన్నారు. అంత గాఢమైంది వారి అనుబంధం. ●



## తెలుగు కథలో

# గ్రామీణ రాజకీయాలు

- డా॥ కంపల్లె రవిచంద్రన్
సెల్ : 9848720478

**ధనబలంతో పాటు, జమీందారీ వర్గాలలో పలుకుబడి కలిగిన గ్రామీణ ఉన్నత వర్గ నాయకులు, స్వార్థ చింతనతో అమాయక గ్రామీణ ప్రజలను బలి పశువులను చేయటమే కాదు - వారి జీవితాలతో చెలగాటాలాడటం కూడా ఈ కథలో కన్పిస్తుంది. స్వాతంత్ర్యానంతరం ఘోరంగా కలుషితమైన గ్రామీణ రాజకీయ వాతావరణానికి తగిన పునాదులు 'అరాచకం' కథలో చక్కగా కన్పిస్తాయి.**

గ్రామీణ వాతావరణంలో ఒకప్పుడు నెలకొని ఉన్న ప్రశాంత, నిర్మల, నిరాడంబర స్నేహ వాతావరణం ఇప్పుడు కన్పించదు. ప్రశాంత జీవన సరోవరాలకు ప్రతిరూపాలుగా విలసిల్లిన గ్రామసీమలు - నేడు కలుషిత, కల్లోల సాగరాలుగా దర్శనమిస్తున్నాయి. ఆప్యాయతలలో, అనురాగాలతో కలసి మెలసి సహజీవనం చేసిన గ్రామీణుల మధ్య నేడు అంతులేని కక్షలు, కార్పణ్యాలు చోటు చేసుకున్నాయి. గ్రామాలలోని వాతావరణం ఇంతగా కలుషితం కావడానికి ప్రధాన కారణం - గ్రామసీమల్లోని రాజకీయాలు.

ప్రజాస్వామ్య జీవన విధానం ప్రసాదించిన ఎన్నికలు, వాటి ద్వారా లభించే అధికార పదవులు, వ్యవస్థ అందించిన పెత్తందారీ దౌర్జన్యాలు, మానవుల్లోని స్వార్థ ప్రవృత్తి, పెరిగిన ధన వ్యామోహం - ఇవన్నీ కలిసి గ్రామ సీమల్ని అరాచకం వైపు నడిపించాయి. గ్రామాల్లోని ప్రశాంతతను భగ్నం చేశాయి. గ్రామీణుల మధ్య నెలకొని ఉన్న చక్కని స్నేహ వాతావరణాన్ని నాశనం చేశాయి.

గ్రామసీమల్లోని అధికార, అనధికార పదవుల కోసం పోటీలు పడుతున్న పెత్తందారీ వర్గాలు గ్రామాలను పార్టీల పేరుతోను, ముఠాల పేరుతోనూ, వర్గాల పేరుతోనూ విభజించి పచ్చని గ్రామీణ వాతావరణంలో 'ఎన్నటికీ ఆరని చిచ్చును' రగిలిస్తున్నాయి. భూస్వామ్యవర్గం తను అధికార దాహంతో, స్వార్థ చింతనతో గ్రామీణ ప్రశాంతతకు భంగం కలిగించటంతో పాటు ఎందరో అమాయక నిరుపేద గ్రామీణులను ఈ కలుషిత రాజకీయ ఊబిలోకి బలవంతంగా దించి వారిని బలిపశువులను చేసి, వారి జీవితాల్ని నాశనం చేస్తుంది. కుళ్లిన ముఠా రాజకీయ చితి మంటల్లో ఇరుక్కున్న ఎన్నో గ్రామాలు రావణ కాష్టాలుగా తయారయ్యాయి. గ్రామ సీమల్లో నెలకొన్న ఇలాంటి విష రాజకీయ వాతావరణాన్ని నేపథ్యంగా చేసుకొని, కుటిల రాజకీయ సర్పదృష్టులు జీవితాల్ని స్వీకరించి ఎందరో కథకులు చక్కని కథలు రచించారు.

జమీందారీవ్యవస్థ రద్దయి, ప్రజాతంత్ర జీవితం ప్రారంభమౌతున్న దశలో గ్రామీణ సామాజిక జీవితంలో చోటు చేసుకున్న రాజకీయ వాతావరణాన్ని, ముఠాతత్త్వాన్ని నేపథ్యంగా తీసుకుని చిత్రించిన కథ వేలూరి శివరామశాస్త్రి రచించిన 'అరాచకం'. జమీందారీ వ్యవస్థను సమూలంగా విప్లవ దృక్పథంతో ఎదిరిస్తున్న కమ్యూనిస్టులొకపక్క, సంస్కరణ వాద దృష్టితో చట్టపరిధిలో జమీందారీ దుర్మార్గపు విధానాలను ఎదుర్కొంటున్న కాంగ్రెసు వాదులొక పక్క ఈ కథలో కన్పిస్తారు. జమీందారీ విధానం రద్దవుతున్న సమయంలో - అలాంటి చారిత్రక మార్పును తమ అవసరాలకు అనుగుణంగా మార్చుకోజూస్తున్న అవకాశవాద, స్వార్థ, ధనికవర్గాలు, ప్రజల సొమ్మును పంచుకొని తినడంలో వాటాలు కుదరక తమలో తాము తన్నుకుంటున్న గ్రామీణ పెత్తందారీ వర్గాలు, వాళ్ళు నడుపుతున్న రకరకాల రాజకీయపు ఎత్తుగడలు - ఈ కథలో రచయిత చక్కగా విశ్లేషించాడు. ధనబలంతో పాటు, జమీందారీ వర్గాలలో పలుకుబడి కలిగిన గ్రామీణ ఉన్నత వర్గ నాయకులు, స్వార్థ చింతనతో అమాయక గ్రామీణ ప్రజలను బలి పశువులను చేయటమే కాదు - వారి జీవితాలతో చెలగాటాలాడటం కూడా ఈ కథలో కన్పిస్తుంది. స్వాతంత్ర్యానంతరం ఘోరంగా

**స్వాతంత్ర్యానంతరం మనదేశ రాజకీయ వ్యవస్థలో సంభవించిన విలువల పతనాన్ని, పరిణామాన్ని చక్కగా విశ్లేషించిన కథ ముద్దుకృష్ణ రాసిన "నా మంత్రి". భారత స్వాతంత్ర్య సముపార్జనకోసం బ్రిటిష్ వారి నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగా పోరాడి - స్వాతంత్ర్యానంతరం స్వతంత్ర భారతదేశంలో మంత్రి పదవినలంకరించిన ఓ కాంగ్రెసు వాది దృక్పథంలో వచ్చిన మార్పును ఈ కథ సూచిస్తుంది.**

కలుషితమైన గ్రామీణ రాజకీయ వాతావరణానికి తగిన పునాదులు 'అరాచకం' కథలో చక్కగా కన్పిస్తాయి.

త్రిపురనేని గోపీచంద్ 'పిత్రార్జితం' కథ మొదటి ప్రపంచ యుద్ధ కాలంలోని రాజకీయ వాతావరణ ప్రభావంతో సాగిన రచన. ప్రపంచ వ్యాప్తంగా వర్తమాన దేశాల్లో జపాన్ పట్ల పెరిగిపోయిన వ్యతిరేకత ఈ చిన్నకథకు ఇతివృత్తం. సరైన అవగాహన, స్పష్టమైన చైతన్యం కలిగిన ఒక కుటుంబం చుట్టూ సాగిన కథ ఇది. జపాన్ ఫాసిస్టు విధానాలకు వ్యతిరేకంగా నిలబడిన ఒక కుటుంబంలోని కుటుంబ సంబంధాలలోను, ఆస్తి పాస్తుల వ్యవహారాలలోను సంభవించిన పరిణామాలను కథకుడు ఈ కథలో చాలా చక్కగా చిత్రించారు.

జపాన్ సామ్రాజ్యవాద ధోరణులకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న తమ రాజకీయ పార్టీకి తన ఆస్తిపాస్తులను స్వచ్ఛందంగా విరాళమిచ్చిన చైతన్యవంతుడైన ఒక యువకుడు ఈ కథలో కేంద్రబిందువు. ఆ యువకుని ఆశయాన్ని మనస్ఫూర్తిగా సమర్థించారు అతని భార్యాపిల్లలు. రాజకీయ ఉద్యమాల్లో చురుకుగా పాల్గొనడానికి ఆస్తిని ఆటంకంగా భావించే ఆ యువకుని మనస్తత్వాన్ని, రాజకీయ జ్ఞాన పరిణితిని, విప్లవ దృక్పథాన్ని, భవిష్యత్తు పట్ల గల అచంచల విశ్వాసాన్ని రచయిత ఈ కథలో స్పష్టంగా చిత్రించాడు. రాజకీయాలు, స్వార్థపరుల ప్రగతికి సోపానాలుగా మారిన నేటి పరిస్థితులలో - ఒకప్పటి నిస్వార్థ, త్యాగ రాజకీయాలను రచయిత ఈ కథ ద్వారా పాఠకులకు పరిచయం చేశాడు.

గ్రామాలలో మునసబులు దుర్మార్గాలతో, దౌర్జన్యాలతో ప్రవర్తించే తీరుతెన్నులు, వారి దుర్మార్గాలకు ఎదురయ్యే ప్రతిఘటనలు, ఇవన్నీ క్రమంగా ఘర్షణలకు దారితీయటాలు, పర్యవసానంగా గ్రామ సీమల్లోని ప్రశాంతత కరువై ఉద్రిక్త వాతావరణం నెలకొనటం, గ్రామీణ రాజకీయ, సామాజిక వాతావరణం కలుషితం కావటం - ఇదీ గ్రామ సీమల నేటి స్థితి. ఈ స్థితిగతులు నేపథ్యంగా వచ్చిన చక్కని కథ మా గోఖలే రాసిన 'మునసబు కచేరీలో మనిషి'.

అర్థబలం, అధికారబలం గల మునసబులు ప్రజారంజకంగా గ్రామపాలన చేయటం - ఎక్కడో తప్ప సంభవించని అరుదైన విషయం. స్వార్థం పెరిగిన గ్రామీణ పాలక వర్గంలో కాముకత్వం కూడా చోటు చేసుకున్నప్పుడు జరిగే విష పరిణామాలకు చక్కని అక్షరరూపం ఈ కథ. మునసబుల దుర్మార్గాలను, దౌర్జన్యాలను సంఘటితంగా, వివేకంగా ప్రతిఘటించే యువకులు - గ్రామీణ - అభ్యుదయ శక్తులకు పెట్టని కోటలు. ఈ కథలో రచయిత అలాంటి యువశక్తులను చిత్రించటం ద్వారా అభ్యుదయ దృక్పథాన్ని, సామాజిక పరిణామ క్రమాన్ని బలపరిచాడు.

గ్రామీణ రాజకీయ వ్యవస్థ యొక్క స్థూల రూపాన్ని రచయిత ఈ కథలో చిత్రించాడు. అర్థ, అధికార బలాలు కలిగిన పెత్తందారీ వర్గాలకు ప్రతినిధి మునసబు కాగా, ప్రజాబలం, చిత్తశుద్ధి కలిగిన అభ్యుదయ శక్తుల బృందానికి నాయకుడు ఆదిశేషు. అన్యాయానికి, న్యాయానికి మధ్య పోరాటం ప్రారంభమయింది. ఈ పోరాటం గ్రామ రాజకీయ వ్యవస్థకు మూలరూపం. ఈ రాజకీయ పోరాటాలు సరైన అవగాహనతో అర్థవంతమైన ఆర్థిక పోరాటాలుగానూ మారగలవు లేదా వర్గ దురహంకారాలతో, కుల మత వైషమ్య కుత్సిత భావాలతో కక్షలు, కార్పణ్యాలుగా రూపుదిద్దుకోనూగలవు.

స్వాతంత్ర్యానంతరం మనదేశ రాజకీయ వ్యవస్థలో సంభవించిన విలువల పతనాన్ని, పరిణామాన్ని చక్కగా విశ్లేషించిన కథ ముద్దుకృష్ణ రాసిన "నా మంత్రి". భారత స్వాతంత్ర్య సముపార్జనకోసం బ్రిటిష్ వారి నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగా పోరాడి - స్వాతంత్ర్యానంతరం స్వతంత్ర భారతదేశంలో మంత్రి పదవినలంకరించిన ఓ కాంగ్రెసు వాది దృక్పథంలో వచ్చిన మార్పును ఈ కథ సూచిస్తుంది. సామాన్య ప్రజానీకం అందించిన ఓట్ల బలంతో మంత్రి పదవిని అలంకరించిన వ్యక్తి - ఆ ప్రజలనే మరిచి ధనవంతులతోను, అధికారులతోను, పారిశ్రామికవేత్తలతోను మమేకం చెందడాన్ని చూసి భరించలేని నిజమైన నిస్వార్థ స్వాతంత్ర్యయోధుడు తట్టుకోలేక తల్లడిల్లిన దయనీయమైన దృశ్యాల్ని రచయిత ఈ కథలో పొందుపరిచాడు. తమ స్వార్థం, ధనవంతుల పరమార్థం తప్ప - సామాన్య ప్రజానీకం యొక్క స్థితిగతుల్ని పట్టించుకోని మంత్రుల వాస్తవ స్థితిని రచయిత ఈ కథలో చక్కగా ఆవిష్కరించాడు.

గ్రామీణ సామాజిక వ్యవస్థలో గ్రామ మునసబు, కరణం, పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ - ఈ ముగ్గురూ మూడు రకాలైన అధికారాలకు కేంద్ర బిందువులు. గ్రామాల్లో ఈ శక్తులు తమ ప్రాబల్యాలను సుస్థిరం చేసుకోవటానికి, పెంచి పోషించుకోవటానికి నిత్యం ఎన్నో 'రాజకీయాలు' నడిపిస్తాయి. ఈ రాజకీయ శక్తులు ఆడే, ఆడించే 'సజీవ రాజకీయ నాటకాలలో' పాత్రధారులు సామాన్యులు. సామాన్యుల 'జీవితాలను సోపానాలుగా మలచుకొని' ఈ రాజకీయ శక్తులు - అధికార పరమపదాన్ని చేరుకుంటాయి.

**గ్రామాలలో సాంఘికంగా వెనుకబడిన వర్గాలకు గ్రామ రాజకీయాధికారం కట్టబెట్టడం ద్వారా, ఆ వర్గాలను ఉద్ధరించగలమన్న ప్రభుత్వ ఆలోచనా విధానం ఆచరణలో ఎంత ఘోరంగా విఫలమైందో స్పష్టంగా చిత్రించిన కథ బొల్లిముంత నాగేశ్వరరావు 'ఓ రిజర్వు పంచాయితీ కథ'.**

మధురాంతకం రాజారాం రచించిన "ముగ్గురు అత్తగార్లు" కథా నేపథ్యమిదే. గ్రామమే ఓ కుటుంబమైతే – ఆ కుటుంబంలో పెత్తనానికి పోటీలు పడే ముగ్గురు అత్తగార్లు.... మునసబు, కరణం, ప్రెసిడెంటు, గ్రామీణ జీవన సౌలభ్యం కోసం ప్రభుత్వం ప్రసాదించిన ఈ పాలక వ్యవస్థ – వాస్తవిక పరిశీలనలో ఎంతగా కుళ్లి, భ్రష్టు పట్టిపోయి, నిర్వీర్యంగా మారిందో రచయిత ఈ కథలో ఎంతో చమత్కారంగా వర్ణించాడు.

గ్రామంలో ఒక్క రాత్రి హరికథ చెప్పుకోవటానికి వచ్చిన హరిదాసుకు గ్రామంలో ఎదురైన విచిత్ర పరిస్థితిని రచయిత వ్యంగ్య ధోరణిలో, చమత్కారం మేళవించి చిత్రించాడు. తమ తమ అధికారాల చెలామణికి, గుర్తింపుకు, 'ముగ్గురు అత్తగార్లు' ఎంతగా ఆరాటపడు తున్నారో, పోటీ పడుతున్నారో రచయిత చక్కగా విశ్లేషించాడు. చమత్కారం, అధిక్షేపణ అంతర్లీనంగా నడిచిన ఈ కథ ద్వారా – గ్రామాలలో అధికారం చెలాయించటానికి మునసబు, కరణం, ప్రెసిడెంట్ల మధ్య నడుస్తున్న 'అంతర్యుద్ధాన్ని' – ఆ యుద్ధాన్ని ఎగదోసి 'ప్రత్యక్ష యుద్ధం'గా మార్చటానికి ప్రయత్నిస్తున్న అవకాశవాద వర్గాల్ని కథకుడు పాఠకులకు పరిచయం చేశాడు. ఒకవేళ అలాంటి విపర్యయ పరిస్థితులెదురైనప్పుడు అనివార్యంగా బలిపశువులుగా మారాల్సిన గ్రామీణుల దుస్థితిని, దురవస్థలను కూడా రచయిత పరోక్షంగా గుర్తు చేశాడు.

రాజకీయాధికార అందలాలను అందుకోవటానికి – తమకన్న బిడ్డల బంగారు భవిష్యత్తును కూడా నేలవేసి కాలరాయటానికి సిద్ధమైన తండ్రుల కుటిల రాజకీయాలకు దర్పణం వల్లంపాటి వెంకట సుబ్బయ్య రచించిన 'గాయపడిన దేవత' కథ. అధికార పదవుల్ని పంచుకోవటానికి అనవసర కయ్యాలకే కాదు – కుటుంబ సభ్యుల భావాలకు, అభిప్రాయాలకు వ్యతిరేకమైన వియ్యాలకు కూడా సిద్ధపడుతున్న రాజకీయ నాయకుల జీవితాలకు అక్షర రూపం ఈ కథ. ఆ జన్మ శత్రువులైన రాజకీయ వాదుల కుటుంబాలు అవసరమైనప్పుడు ఎంతగా దిగజారటానికైనా సిద్ధపడుతారన్న నగ్నసత్యాన్ని కథకుడు ఈ కథలో ఎంతో అర్థవంతంగా వివరించాడు.

చదువు, రూపం, యవ్వనం – అంతకు మించిన సంస్కారం కలిగిన దేవత వంటి జానకి జీవితం దుర్మార్గుడైన కన్నతండ్రి రాజకీయ చదరంగంలో పావుగా మారిన దారుణ పరిస్థితిని రచయిత చక్కని నైపుణ్యంతో చిత్రించాడు. అధికార పదవులు అందించే అమర సుఖాల కోసం – తమ పిల్లల భవిష్యత్తును కూడా పణంగా పెట్టడానికి సిద్ధమైన తండ్రుల రాజకీయ దుర్మార్గాలను రచయిత చక్కగా ఎండగట్టాడు. తాగుబోతుల చేతిలో తల్లక్రిందులైన వైవాహిక జీవితానికి జానకి ప్రతీక.

గ్రామీణ ఎన్నికల వాతావరణానికి సజీవ రూపకల్పన ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి రచించిన 'పీర్ల సావిడి' కథ. ఎన్నికల జాతర్లలో అమాయకంగా బలిపశువులౌతున్న గ్రామీణ సామాన్యుల జీవితాలను అక్షరబద్ధం చేసిన కథ 'పీర్ల సావిడి'. ఎన్నికల వాగ్దాన ప్రభంజనంలో కొట్టుకుపోతున్న నిరుపేద వర్గాల జీవితాలను, వారి జీవితాలను తమ విజయ సౌధానికి అందమైన సోపానాలుగా మలుచుకుంటున్న రాజకీయ నాయకుల దుర్మార్గాలను కథకుడు ఈ కథలో చక్కగా విశ్లేషించాడు.

ఎప్పటికప్పుడు సరికొత్త వాగ్దానాలతో ఎన్నికల రంగంలోకి దిగుతున్న రాజకీయ నాయకులు, ఆ రాజకీయ నాయకుల కొమ్ముకాసి, అమాయక గ్రామీణుల ఓట్లు సంపాదించి తమ పబ్బం గడుపుకుంటున్న మునసబులు, సర్పంచ్‌లు, తమ జీవితాలకు ఏదో ఒరగబెడతారన్న భ్రమలో ఎప్పటికప్పుడు ప్రలోభపడి – పెత్తందార్ల వలలో – అమాయకంగా పడిపోతున్న గ్రామీణులు.. వీరందరి చుట్టూ రచయిత అత్యంత నేర్పుతో ఈ కథను నడిపించాడు. గ్రామాలలోని పెత్తందారీ వర్గాలు తమ స్వార్థ ప్రవృత్తితో అనుసరిస్తున్న పార్టీ ఫిరాయింపులను పచ్చి అవకాశవాద ధోరణులను రచయిత ఈ కథలో స్పష్టీకరించాడు. తమ 'అవసరం' తీరిన తర్వాత రాజకీయశక్తులు కనబరచే 'నిజ స్వరూపాలను' పాఠకులకు కనువిప్పు కలిగేలా దర్శింపజేశాడు. ఈ కథ గ్రామీణ 'ఎన్నికల భాగోతాలకు' చక్కని అక్షరాకృతి.

గ్రామాలలో సాంఘికంగా వెనుకబడిన వర్గాలకు గ్రామ రాజకీయాధికారం కట్టబెట్టడం ద్వారా, ఆ వర్గాలను ఉద్ధరించగలమన్న ప్రభుత్వ ఆలోచనా విధానం ఆచరణలో ఎంత ఘోరంగా విఫలమైందో స్పష్టంగా చిత్రించిన కథ బొల్లిముంత నాగేశ్వరరావు 'ఓ రిజర్వు పంచాయితీ కథ'.

గ్రామీణ స్థానిక పరిపాలనకు కేంద్ర స్థానం పంచాయితీ బోర్డు. నేటి గ్రామీణ వ్యవస్థ, ఎన్నికల విధానం, ప్రజల ఆలోచనా ధోరణి – కేవలం భూస్వాములను, ధనవంతులను, అగ్ర వర్ణాల వారిని మాత్రమే పంచాయితీ బోర్డులకు ప్రెసిడెంట్లను చేస్తున్నది. గ్రామీణ పరిపాలనా వ్యవస్థ ధనస్వాముల భవంతులలో శాశ్వతంగా బందీ అయ్యింది. ఈ విధానాలకు వ్యతిరేకంగా ప్రభుత్వం వారు కొన్ని గ్రామ పంచాయితీల సర్పంచ్ పదవులను సాంఘికంగా వెనుకబడిన వర్గాలకు 'రిజర్వు' చేశారు. అలాంటి రాకీయ రిజర్వేషన్లు వెనుకబడిన వర్గాలకు ఇసుమంతైనా మేలు చేయకపోగా ఆచరణలో వారికి చేసిన ద్రోహాన్ని – ఈ కథలో రచయిత చక్కగా విశ్లేషించారు.

సాంఘికంగా వెనుకబడిన వర్గాల ప్రజలను ఆర్థికంగా, సామాజికంగా ఉన్నత స్థితికి తీసుకురాకుండా – ఒకేసారి హఠాత్తుగా

పాలక వర్గాలలోకి తీసుకురావడం ద్వారా జరిగే అనర్థాలను ఈ కథ వివరంగా చిత్రించింది. తరతరాలుగా అధికారాలను అనుభవిస్తున్న పెత్తందారీ వర్గాలు సాంఘికంగా వెనుకబడిన వర్గాలను ఎలా రాజకీయంగా కూడా దోచుకోగలవో రచయిత స్పష్టంగా విశ్లేషించాడు. కేవలం రాజకీయ రిజర్వేషన్లు వెనుకబడిన వర్గాలకు మేలు చేయకపోగా, కొంత కీడును కూడా చేయగలవని రచయిత నిరూపించాడు.

రావణ కాష్టాలుగా రగులుతున్న గ్రామీణ రాజకీయాలను అత్యంత సమర్థవంతంగా చిత్రించిన కథ పాపినేని శివశంకర్ రచించిన 'మట్టి గుండె' కథ. ఈ కథ గ్రామీణ మధ్యతరగతి కుటుంబాల్లోని దయనీయ పరిస్థితులను చిత్రించడంతో పాటు, గ్రామీణ వాతావరణాన్ని కలుషితం చేసి రణరంగాలుగా మారుస్తున్న కుటిల రాజకీయాలను కూడా నిశితంగా విశ్లేషించింది.

రోజు రోజుకు విశృంఖలంగా పెరిగిపోతున్న ముఠా తత్త్వాలు, ఏర్పడుతున్న పార్టీలు, చెలరేగుతున్న మత, కుల విధ్వంసాలు, విజృంభిస్తున్న అమానుష మారణ హోమాలు, మంట గలుస్తున్న మానవ విలువలు, మరుగున బడుతున్న ప్రశాంతతలు, వికటాట్టహాసం చేస్తున్న స్వార్థ, నిరంకుశ ధోరణులు, ఛిన్నాభిన్నమౌతున్న సామాన్యుల జీవితాలు – ఇదీ నేటి గ్రామాల వికృత నగ్న స్వరూపం. రచయిత 'మట్టిగుండె' కథలో చిత్రించిన గ్రామీణ జీవన యదార్థ దృశ్యమిది. కష్టలతో, కార్పణ్యాలతో అతలాకుతలమౌతున్న మధ్యతరగతి రైతు కుటుంబాల కన్నీటికి కథకుడు ఇచ్చిన అక్షర రూపం ఈ కథ. కుటిల రాజకీయ రావణ కాష్టంలో మండి మసిగా మారటానికి సిద్ధమౌతున్న గ్రామీణ జీవితాన్ని ఎంతో ముందు చూపుతో హెచ్చరించే అర్థవంతమైన రచన 'మట్టిగుండె' కథ.

అధికార యంత్రాంగంలో అలసత్వం, అవినీతి పెరిగి, అధికారులు, అనధికారులు రాజకీయ నాయకుల పలుకుబడులను, ఆధిపత్యాలకు అమ్ముడుపోయి, ప్రజల సంక్షేమం మరిచి, పాలకుల సౌఖ్యం కోసం అహర్నిశలు శ్రమించే దుష్ట రాజకీయ సంప్రదాయం బలంగా నెలకొన్న దౌర్భాగ్యపు కాలమిది. ఇట్టి విషమ పరిస్థితులలో నీతి, నిజాయితీ, పట్టుదల, పరిశ్రమలతో నిరంతరం శ్రమించి – తన పరిధిలోనున్న గ్రామాల సత్వరాభివృద్ధికై చిత్తశుద్ధితో శ్రమించి ఎవ్వరూ ఊహించని ఎన్నో సత్ఫలితాలను సాధించిన ఒక ఆదర్శ అధికారి యొక్క అద్భుత కార్యాచరణ నేపథ్యంగా సాగిన కథ బలివాడ కాంతారావు రచించిన 'అభ్యుదయం'.

ప్రభుత్వం ప్రజా సంక్షేమం కోసం ప్రకటించే ఎన్నో పథకాలు – రాజకీయ సుడిగుండాల్లోనూ, అధికార యంత్రాంగంలోని స్వార్థ, అవినీతి బురద గుంటల్లోనూ పడి ప్రజలకు అందటం లేదు. రాజకీయ నాయకులు, అధికారులు, కాంట్రాక్టర్లు ప్రజా సంక్షేమ పథకాల ప్రయోజనాలను ప్రజల కందకుండా కేవలం కాగితాలకు మాత్రమే పరిమితం చేస్తున్నారు. ఇలాంటి విపర్యయ పరిస్థితులకు వ్యతిరేకంగా ధైర్యంగా ఎదురీది, ప్రజల్లో నిద్రాణమై ఉన్న సంఘటిత శక్తిని జాగృతం చేసి, వారి సంక్షేమ పథకాల్లో వారినే భాగస్వాములను చేసిన ఓ యువ అధికారి జీవితాన్ని కథకుడు ఆదర్శవంతంగా ఈ కథలో అక్షరీకరించాడు.

శ్రామిక, కార్మిక వర్గాలు రెండూ తమ శ్రమశక్తి ఆధారంగానే జీవికను గడుపుకునే వర్గాలు. కానీ – కార్మికవర్గం సుసంఘటితమై ఉండడం వల్ల తమ జీవన స్థితిగతులు మెరుగుపరచుకోవటానికి సమ్మెలు కట్టగలుగుతారు. యజమానులతోనూ, ప్రభుత్వాలతోనూ పోరాడగలుగుతారు. శ్రామిక వర్గం సుసంఘటితం కాకపోవడం వల్ల, కేవలం పల్లెలకు మాత్రమే పరిమితం కావటం వల్ల – తమ జీవన పరిస్థితులు చక్కదిద్దుకోవడానికి ఏమి చెయ్యాలో కూడా తెలీని దయనీయ స్థితిలో ఉన్నారు. గ్రామీణ, శ్రామిక, రైతాంగ వర్గంలో సరైన అవగాహన, రాజకీయ జ్ఞానం కలిగించి, వారినందరినీ ఏకోన్ముఖులను గావించిన ప్రధాన సంఘటనతో రచించబడ్డ కథ డా॥ పులికంటి కృష్ణారెడ్డి "గోడలకు నోళ్లు".

గ్రామీణ రైతులందరూ సంఘటితంగా తయారై, పల్లెపల్లెకు కదలి రైతు వాహినిగా మారి – తమ శక్తిని, స్థాయిని, వ్యవస్థలో తమకున్న స్థానాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చిన సన్నివేశాన్ని కథకుడు చక్కగా చిత్రించాడు. గ్రామీణ అభ్యుదయాన్ని అందమైన నినాదాలతో వల్లించే ప్రభుత్వాలకు – తాము పదవిలో కొనసాగటం తప్ప, నిజమైన అభ్యుదయాభిలాషలేదన్న నగ్నసత్యాన్ని ఈ కథ బలంగా నిరూపించింది. నినాదాలు అధికార సింహాసనాలను సునాయాసంగా అధిరోహించటానికి పనికి వచ్చే అందమైన సోపానాలని రచయిత ఈ కథలో తీర్మానించాడు.

పై కథకులే గాక వై.సి.వి.రెడ్డి (ఇంకానా?), ఆర్. వసుంధరా దేవి (మాయ), పి. రామకృష్ణారెడ్డి (ఎలిగే పెద్దోళ్లూ – నలిగే సన్నోళ్లు), సింగమనేని నారాయణ (ఫిరంగిలో జ్వరం), చిలకూరి దేవపుత్ర (ఆయుధం), కాలువ మల్లయ్య (యుద్ధభూమి), తిమ్మనేని అక్కిరాజు ( మంచీ చెడూ), కె. సభా (బూరగపండు), బోయ జంగయ్య (దున్న), డా॥ వి.ఆర్. రాసాని (శనీస్సురుడు), పాలగిరి విశ్వప్రసాద్ (కరువూ వచ్చె – కచ్చులూ వచ్చె), కస్తూరి (కాలం కరిచింది), వి. ప్రతిమ (రాచపుండు) మొదలైనవారు గ్రామీణ రాజకీయ వాతావరణాన్ని అత్యంత సహజంగా చిత్రించారు.

గ్రామ సీమల్లోని రాజకీయ వాతావరణం, ఆ వాతావరణం అందించిన కాలుష్య మాధారంగా రచించిన కథలు ఈ వ్యాసంలో పరిశీలించబడ్డాయి. ఒకప్పటి గ్రామీణ ప్రశాంతతకు, సమరస భావనకు, అర్థవంతమైన అవగాహనకు, నిరాడంబర నిస్వార్థ జీవన విధానాలకు భంగకరంగా రూపొందిన కుటిల రాజకీయ వాతావరణ దుష్ప్రభావాలను కథకులు ఈ కథల్లో చక్కగా విశ్లేషించారు. ముఠా రాజకీయ మారణ హోమాల్లో బలిపశువులౌతున్న సామాన్య ప్రజల కన్నీటి వెనుక దాగిన జీవన వాస్తవాల్ని కథకులు ఈ కథల్లో పొందుపరిచారు. అధికార పదవీ వ్యామోహాలతో, ధనమదాంధతతో, దుష్టనికృష్ట రాజకీయాలతో గ్రామీణ పెత్తందారీ వర్గం చేస్తున్న దుర్మార్గాల్నీ, దౌర్జన్యాల్ని కథకులు తమ కథల ద్వారా వెలుగులోకి తెచ్చారు.

●

# అంతర్లోకం - బహిర్ దుఃఖం!

- రాధేయ, సెల్ : 9985171411

నేనెప్పుడూ ఎవ్వరికీ అర్థం కాను
నా అంతర్లోకంలోకి
ఎవ్వరూ అడుగుపెట్టలేరు
అక్షరం మీద అలౌకిక వ్యామోహంతో
తృప్తి చెందని జ్ఞాన దాహం నాది
తుఫానుకీ, తీరానికీ మధ్య ఘర్షణలో
ఇసుక మేటల్లో మృదువుగా పరచుకున్న
నీటి తడిని నేను!
రేగు ముళ్ళపై రాలిపడిన పూరేకులపై
సూర్య కిరణాల పరామర్శను నేను
ఒంటరి శూన్యంలో లోలోపల విరిగిపడుతున్న
కొండచెరియల్లాటి దుఃఖంలో
ఎగిసిపడే భావోద్రేకాన్ని నేను
అశ్రువుకీ, ఆనంద భాష్పానికీ మధ్య
అంతుచిక్కని జీవన రహస్యాన్ని
అన్వేషించే తాత్త్వికుణ్ణి నేను!
కరిగిపోయే మంచు మబ్బుల నుండి
ఆకుపచ్చని జీవావరణంలోకి
ఇంద్ర ధనుస్సునై ప్రవేశించాలని ఉంది
జన్మ రహస్యంలోనూ, మృత్యుఘోషలోనూ
జ్వలించే ఆత్మగౌరవ స్వరం
దివ్య పరిమళమై వికసించాలని నా ఆకాంక్ష
మృత్యువు ముందు మాటచెప్పదు
మమకారాలన్నింటినీ చాపలా చుట్టేసుకొని
మౌనంగా నిష్క్రమిస్తుంది
జననం సంజాయిషీ ఇవ్వదు



అచ్చమైన అమాయకత్వాన్ని తొడుక్కొని
దేహంగా దర్శనమిస్తుంది
బిగిసిన పిడికిళ్ళతో మొదలైన జీవన పోరాటం అది!
ఊహకందని కొత్త తుఫాను
నా మనోసంద్రం లోంచి ఎగిసిపడుతోంది
నా స్వచ్ఛమైన ప్రాణవాయువును రెపరెపలాడిస్తోంది
ఈ నిరంతర కల్లోల ఘర్షణలో
ఉద్యమాలు గాయపడినప్పుడల్లా
రాజకీయం లాభపడుతుంది
ఆకలిని ఆకర్షక పథకంగా రూపొందించి
నీ కడుపు మీద కొట్టి కాలరెగేసుకుంటూ
దర్జాగా వెళ్ళిపోతుంది
పగుళ్ళు వారిన నేలలో వాగ్దానాల ఊడలు
చొచ్చుకొనిపోతాయి
ఆత్మగౌరవం లేని దేశంలో
అమాయక ప్రాణం కొవ్వొత్తిలా కరిగిపోతుంది
వణుకుతున్న చేతుల్లో జెండా రెపరెపలాడుతుంది
నిస్సహాయ ఖైదీ ఆత్మకథలోంచి
గాయపడిన న్యాయదేవత కంటతడిపెడుతున్నా
మేధావుల మౌనం ధిక్కారం ప్రకటించదు
ఒరలో వొదిగిపోయిన కత్తి నోరెత్తి మాట్లాడదు
బుల్లెట్లు నిండిన గన్ కళ్ళెత్తి చూడదు
శత్రు శిబిరం నీ ఉనికిని పసిగట్టి
నీ నిద్రా రాత్రుల మీద నిఘా పెడుతుంది
ఎడారిలో నీటి జాడను వెతుకుతున్నవాడు
కొత్త వేకువలోకి ఎప్పుడు చేరుకుంటాడు?
మలుపు మలుపులోనూ తలెత్తే కలుపు మొక్కల్ని
నిర్మూలించుకుంటూ ఎవరి నడకకు వారే
రహదారి ఏర్పరచుకోవాలి!
వెలుగును వెక్కిరించి ఆకాశం మీద ఉమ్మేసుకోవడం కంటే
నిష్ఠుర సత్యాల్ని నిజాయితీగా ఒప్పేసుకుందాం!
ఈ అంతర్ బహిర దుఃఖాన్ని చెరిపేసుకుందాం!!

---

ఫాంటమ్ కవిత

# అనేక సున్నాల నడుమ

- ఎన్.వి. రఘువీర్ ప్రతాప్

సెల్ : 9440551552

కనుపాప కంటిని కాటేస్తున్న సందర్భం
కంచె చేనును మింగుతున్న కుంభకోణం
విలాసాల చివరి చిరునామా విషాదాంతమైతే
వ్యవస్థ దారి తప్పిన లెక్కల గారడి

కంచె చేనును మింగుతున్న కుంభకోణం
అందని ఆకాశపు అంచుల దాకా అవినీతి కథ



వ్యవస్థ దారి తప్పిన లెక్కల గారడి
అభద్రతా భావనలో క్షణ క్షణం భయం భయం

అందని ఆకాశపు అంచుల దాకా అవినీతి కథ
బతుకు చట్రంలో అతుకు పడ్డ జీవితం
అభద్రతా భావనలో క్షణ క్షణం భయం భయం
మనిషిని మనిషే కాటేస్తున్న కాలమే సాక్ష్యం

బతుకు చట్రంలో అతుకు పడ్డ జీవితం
విలాసాల చివరి చిరునామా విషాదాంతమైతే
మనిషి మనిషే కాటేస్తున్న కాలమే సాక్ష్యం
మతం కొంత స్వార్థం మరింత కల్సిన రంగుల పుంత

అనువాద కథ

# జన్మగతం ?



తమిళ మూలం : కశ్యపన్

హిందీ నుండి తెలుగు : మనస్విని

**"అమ్మా! నేను ఏ సుందర్‌నీ గిందర్‌నీ చూడదలచుకోలేదు."**

**"ముందా ఇడియట్ బాక్సును ఆఫ్ చెయ్యి" తల్లి లక్ష్మి వంటింట్లో నుండి అరిచింది.**

**"టీవీలో కాదమ్మా! నేనే చెప్పాను." చెప్తూ కాఫీగ్లాస్ పట్టుకొని లోపలికొచ్చింది లక్ష్మి కూతురు సుందరి.**

సుందరి బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీ పొందింది. ధాతువుల్లోని పరమాణువుల గురించి పరిశోధన కూడా చేసింది.

యూరోపియన్ విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తోంది. ఒక మల్టీ నేషనల్ కంపనీలో కన్సల్టెంట్‌గా కూడా చేస్తోంది. వయస్సు ముప్పై ఆరేళ్ళు. అవివాహిత.

తల్లి కూతుర్ని తదేకంగా చూసింది. పట్టులాంటి ముఖం కొద్దిగా వదులుగా కనిపించింది. దేహయష్టి మీద వక్షస్థలం కొద్దిగా జారింది.

దీర్ఘంగా నిశ్వసించింది.

"శుక్రవారం నీవు ఫ్రీయేనా?"

'లేదమ్మా! నేను నాగపూర్ వెళ్తున్నాను."

'ఎప్పుడొస్తావు?"

"ఫ్లైట్ దొరికితే ఆ మధ్యాహ్నమే. ఏమ్మా! ఎందుకు అడుగుతున్నావు?" లక్ష్మి ముఖం చిట్లించింది. "నా ఖర్మ. ఏమి చేద్దాం? మరల దీర్ఘంగా నిట్టూర్చింది.

"అమ్మా!" సుందరి తల్లి దగ్గరి కొచ్చింది. "ఎందుకు టెన్షన్ తీసుకుంటావమ్మా? నాకు ఏది కావాలో దాని నిర్ణయం తీసుకొనే హక్కు నాకు లేదా?.......... ప్లీజ్....... లీవిట్ టు మీ" తల్లికి స్వాంతన నిచ్చేందుకు ప్రయత్నించింది.

"ఆ! అధికారం! తప్పంతా నాది. నన్ను చెప్పుతో కొట్టు...... పెద్ద చదువు.... మంచి సంపాదన.... కాని, మంచి జీవితమే దొరకలేదు. తల్లి అన్నది.

"ఏదమ్మా మంచి జీవితం? శోభనం పేరుతో ముక్కూ ముఖం తెలియని మనిషితో కలసి పడుకోవటమా?..... పిల్లల్ని కనటమా?..... రాత్రనక, పగలనక కష్టపడి తయారుచేసిన పరిశోధనా వ్యాసాన్ని ఆ అపరిచితుని పాదాల దగ్గర సమర్పించటమా?.... చాలమ్మా చాలు......... మీ తరానికే చాలు......"

"నీవు ఆడపిల్లవే అమ్మా" గట్టిగా చెప్పింది లక్ష్మి.

"అయితేనేం? మా కంపెనీ "వాయిస్" ఏమంటాడో తెలుసా? ఫార్ ఈస్ట్ కంపెనీ అధికారం నాకిస్తారట....... కంపెనీ కోసం... కోట్ల డాలర్లకు సంబంధించిన అధికారం నాకివ్వబోతున్నారు. అతనికి నామీదున్న విశ్వాసం నీకు నీ కూతురు మీద లేదు. నా జీవితానికి సంబంధించిన నిర్ణయం తీసుకొనే సమర్థత నాకుందమ్మా. నీవు చింతించకు."

"నీవు ఆడపిల్లవు. సుందరానివి కావు" లక్ష్మి అరచింది.

సుందరి మాట్లాడలేదు. గ్లాసు క్రింద పెట్టింది.

"దాన్ని కడిగిపెట్టలేవా?"

"సుందరమైతే కడగాల్సిన పనిలేదు కదమ్మా!"

"నీవు ఆడదానివి."

"నేనలా అనుకోవటంలేదు."

"ముప్పై ఆరేళ్ళ అమ్మాయి నోట ఇలాంటి మాటలా!"

"అమ్మా! 'ఆడపిల్ల' అనే పదం కేవలం ఒక భావన కాన్సెప్ట్. అంతే!"



"వద్దమ్మా! అలా మాట్లాడకు. సర్వనాశనానికి దారితీసే మార్గం వైపు వెళ్లకు. నా మాట విను."

ఆ సంభాషణ నంతటితో ముగించి, లక్ష్మి స్నానానికి వెళ్ళింది. సుందరి "సైన్స్ వరల్డ్" పత్రిక తీసుకొని చదవసాగింది.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు స్నానం చేసి, భోజనానికి సిద్ధపడింది.

"భోంచేస్తావా?" తల్లి అడిగింది.

"ఊ. తరువాత కొంతసేపు నిద్ర పోవాలి. మూడు గంటలకు నన్ను నిద్రలేపు."

"ఆఫీసుకెళ్ళాలా?"

"నాలుగు గంటలకు బాస్ వస్తాడు. డిస్కషన్ కూడా వుంది. రాత్రి డిన్నర్ డిస్కషన్..... ఒంటి గంటవుతుందమ్మా!" కూతురు చెప్పింది.

"ఇదేం బాగా లేదు. నూరుసార్లు చెప్పాను."

"సుందరానికి ఒక్కసారయినా చెప్పావా?"

లక్ష్మి ముఖంపై ఒకవైపు కోపం, మరోవైపు నిస్సహాయత.

సుందరి టేబుల్ దగ్గర కూర్చొని తినసాగింది. తల్లిని కూడా కూర్చొని తినమంది. లక్ష్మి ఎదురుగా కూర్చొని ప్రేమగా కూతుర్ని చూడసాగింది.

"అమ్మా!" మొదలుపెట్టింది సుందరి." నేను ముప్పై ఆరేళ్ల యువతిని పసిపిల్లను కాను."

"నాకెప్పుడూ చిన్నపిల్లవే నీవు" తల్లి కంఠం గద్గదమైంది.

సుందరి తన ఎడమచేత్తో తల్లి ఎడమచేతిని నొక్కింది. ఇద్దరూ చేతులు పట్టుకొని కూర్చున్నారు.

"అమ్మా! నేను పుట్టిన కొంతసేపటికే సుందరం పుట్టాడు. వాడు నా తమ్ముడు.... కాని...." లక్ష్మి నిశ్శబ్దంగా వింటోంది. "వాడికి కుర్తా పైజమా వేస్తే నాక్కూడా వేసేదానివి. నాకు ఫ్రాకు వేస్తే వాడికి కూడా ఫ్రాక్ వేసేదానివి. ఇద్దర్లో ఏమాత్రమూ తేడా చూపించలేదు" సుందరి ఆగింది.

ఒక ముద్ద అన్నం తిని, నీళ్ళు తాగింది.

"అమ్మా! నీకు గుర్తుందా! ఒకరోజు సుందరం నీ దగ్గరికి పరిగెడుతూ వచ్చాడు. మూడేళ్ళవాడనుకుంటా అప్పుడు. "అమ్మా... అమ్మా అంటూ సంతోషంగా పరిగెడుతూ వచ్చాడు."

"అమ్మా! సుందరి పోగొట్టుకుంది" ఆశ్చర్యంగా అన్నాడు.

నీవు గట్టిగా ఒక చెంపదెబ్బ కొట్టావు. స్వయంగా చూసిన విషయాన్ని, సంతోషంగా తల్లితో పంచుకోవటానికి వాడు వచ్చాడు....

"వాడు ఏడ్చాడు... నీవెందుకు కొట్టావో నాకు.... నాకు అర్థంకాలేదు.... ఏడుపొచ్చింది.... నేను ఏడ్చాను. నీ వ్యవహారంలో కొంత తేడా అప్పుడు కనిపించింది. అయినా... అర్థమయ్యీ.... కాకుండా..." లక్ష్మి మధ్యలో ఆ మాటల్ని తుంచివేసింది.

" చాలిక.. ఆపు. భోజనం పూర్తయి వుంటే చెయ్యి కడుక్కో. రేపు మీ అక్క వస్తుంది. దాన్తో మాట్లాడుదువు గాని."

"ఎందుకొస్తోంది తను?"

"నీతో మాట్లాడేందుకు."

సుందరికి అర్థమైపోయింది. ఎంత పిచ్చివాళ్ళు వీళ్ళు!

అను కాలేజ్‌లో లెక్చరర్ గా పనిచేస్తోంది. ఆమె భర్త పోర్ట్ ట్రస్ట్‌లో హెడ్‌క్లర్క్.

ఆమె దగ్గర కారుంది. స్వయంగా నడుపుతుంది. ఇంగ్లీష్ లిటరేచర్‌లో డాక్టరేట్ తీసుకుంది. "ఆంగ్లభాష – వైజ్ఞానిక పదావళి" అనే ఆమె పుస్తకం పలువురి ప్రశంసలందుకుంది.

ఆదివారం 'అను' వచ్చింది. ఢిల్లీ నుండి తల్లి కోసం సున్నితమైన కాశ్మీరు శాలువ తెచ్చింది. సుందరి కోసం డార్క్ బ్లూ జీన్స్, స్కై బ్లూ టాప్ తెచ్చింది.

"సుందరీ! నీవు థాయ్‌లాండ్ వెళ్తున్నావట. తిరిగి రావటమెప్పుడో" 'అను' అడిగింది.

"అవునక్కా! రెండు వారాలు పడుతుంది. కనీసం పదిరోజులైనా అక్కడ వుండాల్సి వస్తుంది."

"చాలా ధైర్యమే నీకు"

"ఎందుకక్కా?"

"విద్యావంతురాల్ని అయినప్పటికీ నాలో ధైర్యం లేదనా నీ ఉద్దేశ్యం?"

జవాబిచ్చేందుకు సుందరి అక్కడ లేదు. కొత్తబట్టల్ని భుజంపై వేసుకొని అద్దం ముందు నిలబడి చూసుకుంటోంది.

"సుందరీ ఏమిటిది? నేను అడుగుతున్నాను. నీవు వెళ్ళిపోతున్నావు."

"సారీ అక్కా! నీ ప్రశ్నకు జవాబిస్తే నీకు కోపం వస్తుంది."

"లేదు సుందరీ! నీవు నా ప్రియమైన చెల్లెలివి."

"లేదక్కా! కొన్ని మాటలకు కోపం వస్తుంది."

"పోనీ వదిలెయ్యి. ప్రతినెలా స్విట్జర్లాండ్, ఆస్ట్రేలియా, పారిస్ అని ఎగుర్తూ వుంటావు. పెళ్ళి చేసుకొని స్థిరపడే ఉద్దేశ్యం లేదా ఏమి?"

"పెళ్ళా? తాగుడుతోనా? బావగారిలా తాగుడుతో స్థిరపడనా?"

అను అవాక్కయింది. "నీవు హద్దుమీరుతున్నావు" కోపంగా అంది.

"వదిలెయ్యక్కా! నీకు కోపమొస్తుందనే జవాబివ్వలేదు నేను.

"సుందరీ! నీవు చెప్పేది సరిగా లేదు. చేస్తున్నదీ సరిగా లేదు" సుందరి చెప్పింది.

"ఏమి సరిగాలేదు?" సుందరి అడుగుతుండగా లక్ష్మి వచ్చింది." నీవేది సరిగా చేస్తావు గనుక" అంటూ.

"ఇద్దరూ కూడబలుక్కున్నారా ఏం?" వాతావరణాన్ని తేలిక పరచేందుకు ప్రయత్నించింది సుందరి.

"అమ్మ చాలా బాధపడుతూంది. సుందరీ! నిన్న రాత్రి మూడుగంటలకు వచ్చావట. నీ బాస్ వచ్చాడట నిన్ను దింపటానికి. వాపస్ వెళ్ళేటప్పుడు అతని కాళ్ళు తడబడుతున్నాయట."

"నేనైతే తడబడలేదు కదా!"

"అతడు తాగి వున్నాడుః" లక్ష్మి చెప్పింది. "తాగినప్పుడు నీతో రావద్దని చెప్పి వుండాల్సింది."

సుందరి జవాబు చెప్పలేదు.

మెల్లగా అను దగ్గరికివెళ్ళి అన్నది" బావగారితో నీవలా చెప్పగలిగావా?....... ఆయనా తాగుబోతే కదా!..... నీ భర్త... ఇతడైతే నాకు బాస్...... ఆఫీస్ కొలీగ్. ఆ దేశపు సభ్యతే అలాంటిది. కల్పించుకొనే హక్కు నాకు లేదు. కావాలంటే దూరం కావచ్చు."

"విడిపో మరి!" అను చెప్పింది.

"ఆ! విడిపో! నీవు విడిపోతావా? నాకు బాగా గుర్తుంది. నేనప్పుడు ఎనిమిదవ తరగతి చదువుతున్నాను. నీవు, బావగారు ఇద్దరూ వచ్చారు. నాకోసం లంగా, ఓణీ అన్నీ తీసుకొచ్చారు. మొదటిసారి కావటంతో నాకు సరిగా వేసుకోవటం రాలేదు. నేను వాటిని వేసుకొని, బయటికి రాగానే బావగారు నన్ను తన చేతుల్తో కౌగలించుకున్నారు. ఎత్తుకొని, ముద్దు పెట్టుకొన్నారు. నాకు ఆయన శరీరం గుచ్చు కుంటున్నట్లనిపించింది. నిన్ను చూసాను. నీవు ముఖం ముడుచుకున్నావు. బావగారు తన వ్యవహారంతో "నీవు ఆడపిల్లవు. నీది స్త్రీ జాతి" అని చెప్పారు.... నాకది నచ్చలేదు. కనీసం ఏకాంతంలోనైనా నీవీ విషయమై అడిగావా? ఈ ప్రవర్తన కారణంగా ఆయనకు దూరమయ్యావా?"

సుందరి గోడనానుకొని వరండాలో కూర్చుంది. తల్లి కిటికీ చివర్న కూర్చుంది. అను దిగ్భ్రాంతురాలై మాట్లాడకుండా కూర్చుంది.

సుందరి మరల శబ్దాల వర్షం కురిపించ సాగింది." అమ్మా! తోటలో చిలుకలుంటాయి..... వాటిలో ఆడవేవి? మగవేవి? చూడగానే గుర్తించగలవా? గుడ్లు పెట్టి, వాటిలో నుండి పిల్లల్ని పొదిగి, బయటికి తీసినప్పుడు ఆడదని తెలుస్తుంది. చిలుకల మధ్య ఇలాంటి జ్ఞానం వుంటుందో లేదో తెలీదు..... మిగిలిన పనులన్నీ.... గూడు కట్టటం, ఆహారం తీసుకొని రావటం..... ఇవన్నీ రెండూ కలిసే చేస్తాయి. ఒకప్పుడు మనిషి మనిషిని గుర్తుపట్టేవాడు కాదు. జంతువుల్లాగే జీవితం గడిపేవాడు. అప్పుడు ఆడ యేమిటి?, మగ ఏమిటి? ...ఏది తెలీదు.. అమ్మా! పుట్టినప్పుడు అందరూ ఒకే రకమైన ప్రాణులు... ఆడపిల్ల పుట్టదు. అమ్మా! నీలాంటివాళ్ళు పుట్టిస్తారు....."

సుందరి వెక్కి వెక్కి ఏడవసాగింది. ■

# చిత్రం భళారే విచిత్రం

హిందీ మూలం : డా॥ మదన్ గోపాల్ లడా

తెలుగు సేత : డా॥ ఉప్పలధడియం వెంకటేశ్వర

ఆల్బంలో
నలుపు - తెలుపు బొమ్మల్లో
ఎన్నెన్ని రంగులో!

వాటిని చూస్తుంటే
ఎన్నెన్ని జ్ఞాపకాలు
మళ్ళీ చిగురిస్తాయో!

నిజం సుమా
ఆ ఫొటోలో కనిపించేది నేనే
కింద నా పేరు
ఫొటో దిగిన తేదీ
స్పష్టంగా కనిపిస్తున్నాయిగా!

నిజమే సుమా
అద్దంలో చూసుకుంటే
నాకే సందేహం కలుగుతోంది గానీ
అప్పుడు అలాగే ఉండేవాణ్ణి మరి

కాలాన్నెవరో
వెనక్కు లాగుతుంటే
పల్లెటూళ్ళో పెంకుటింట్లో



అమ్మమ్మ తాతయ్యలతో
పిల్లలందరం
కలిసి ఫొటో దిగిన క్షణాల్లోకి
మళ్ళీ ప్రవేశిస్తాను
కాలాన్ని కెమెరాలో బంధించిన క్షణం
ఎంత మధుర స్వప్నమో!

అబ్బాయి అంటాడు
"నాన్న చూడు, అచ్చం నాలాగే ఉన్నారు"

ఆవిడ అంటుంది
"అప్పుడెంత అమాయకంగా కనిపిస్తున్నారో"

అమ్మ మౌనం వహిస్తుంది
'ఫొటోలోని కుర్రాడు
ఇప్పుడు కనిపిస్తున్నాడా?'

ఇరవై మంది అబ్బాయిలు,
ఏడుగురు అమ్మాయిలు
మధ్యలో ముగ్గురు ఉపన్యాసకులు
బి.ఏ. చివరి సంవత్సరం
దిగిన గ్రూప్ ఫొటో

కాలధూళి తగిలి
ఫొటో మాత్రమే కాదు
స్మృతులు కూడా మసకబారాయి

ఒక్కొక్కరి పేరూ
ఉత్సాహంగా చెబుతుంటాను
హఠాత్తుగా ఒకచోట
గొంతు జీరబోతుంది

ఎదురుగా మొండిగోడను చీల్చుకొచ్చిన
మొక్కకేసి చూస్తుంటే
పాపాయి అంటుంది
"తరువాతి ఫొటో చూపించు నాన్నా!"

---

# అక్కరకు రాని...

- శ్రీమతి చెళ్ళపిళ్ళ శ్యామల

సెల్ : 9949831146



అమ్మ పిలుపులోని
కమ్మదనం కోసం
సమస్యల సుడిగుండాలెన్నో
దా.....టి
కష్టాల కెరటాలను
ఈ.....ది
అలుపెరుగని అంబుధివై
"అమ్మా!" అని
పిలిపించుకున్నావు!

నా రూపాన్ని చూసి
మురిసావు
నా ఆట పాటలకు
పొంగిపోయావు
నా నోటి
గోరుముద్ద వైనావు
నా గొంతెమ్మ కోర్కెలు తీర్చే
అద్భుత దీపమయ్యావు!

సైంటిస్టువై
నా సంశయాలు తీర్చావు!
సైక్రియాటిస్టువై
నా మనసుని చదివావు!

పదిమందీ...
నను మెచ్చుకునేవేళ
ఆనందం... నీ కనుల
వర్షమవటం నాకు తెల్సు!
మంచి ఉద్యోగమంటూ
నే ఖండాంతరాలు దాటి
వెళుతున్నపుడు
నా ఇష్టాన్ని కాదనలేక

నన్నొదిలి వుండలేక
నువు పడ్డ నరకయాతన
నాకు తెల్సు!
నీ కనులు ఎడారవడమూ
నాకు తెల్సు!

భూమికి చెరో వైపూ...
మనమిద్దరం వున్నా కూడా
నా గుండె చప్పుడు
నీవు... వినగలవనీ తెల్సు!

అన్నీ!.... అన్నీ.... తెల్సి కూడా
పెరటి చెట్టునై.... నీకు
నీడనివ్వలేకపోయాను
నోటి ముద్దనై- నీ ఆకలి
తీర్చలేకపోయాను
నీ చివరి క్షణాల్లో...
నీ కడసారి చూపుకు
అందలేకపోయాను
అక్కరకు రా(లే)ని
నన్ను క్షమిస్తావు కదూ!

# వ్యాస భారతంలో వస్త్రాపహరణం



- డా॥ ఇందిరాదేవి కాకర్లమూడి

ఒక విషయాన్ని ఊహించాలే కాని అది ఎంత దూరమైనా పోతుంది. నిండు కొలువులో ద్రౌపది కట్టు వస్త్రమైన చీరను ఊడదీసి ఆమెను నగ్నంగా చేయాలన్న తలంపు కౌరవులకున్నట్లుగా పరంపరానుగతంగా భావించడం జరుగుతున్నది. అది ఏ వస్త్రం? ఎలాంటి అపహరణం? అనే మీమాంస ఎవరికీ ఇంతవరకు కలగకపోవడం విచిత్రమే.

ఒక స్త్రీకి వస్త్రాపహరణం జరిగింది అనగానే వెంటనే నగ్నతా దృశ్యం స్ఫురించి గొప్ప సానుభూతి వచ్చేస్తుంది. ఆపై నాటకాలు, సినిమాలు, టివి. సీరియళ్ళు, మోనో యాక్షన్లు. దద్దరిల్లే డైలాగులతో జనరంజకంగా వచ్చేశాయి.

నిజానికి ముందుగా వస్త్రాపహరణం జరిగింది పాండవులకు. ద్రౌపది కంటే పాండవులకు ముందుగా వస్త్రాలు తొలగింపబడ్డాయి. ఆమెకు జరిగిన పరాభవాల్లో వస్త్రాపహరణం చాలా చిన్న అంశం. పాండవులకు జరిగిన వస్త్రాపహరణం గురించి తలచుకున్న వారే లేరు కాబట్టి దాని గురించి రచనలు కూడా లేవు. ఒక స్త్రీకి, అందునా భారతేతిహాస నాయికకు జరిగింది కాబట్టి ఇన్ని రచనలు, ఇంత దుమారం.

ఆనాటి దాస ధర్మాన్ని బట్టి ముందుగా పాండవుల వస్త్రాలు తొలగింపబడ్డాయి. ప్రత్యర్థులు ఓడిపోయి దాసులైనపుడు ముందుగా వాళ్ళు తీయవలసింది పై వస్త్రాలను అనగా ఉత్తరీయాన్ని.

జూదంలో పాండవులు సమస్తం ఓడిపోయి కౌరవులకు దాసులుగా పరిగణింపబడ్డారు. ఇలా నిర్ణయించడంలో దాస ధర్మాన్ని ప్రతిష్ఠించడం జరిగింది. ద్యూత పరాజితులైన పాండవుల్ని, దాసులుగా చేయడం కోసం మొట్టమొదట చేయవలసిన కార్యం వారి వస్త్రాలను తొలగించడం. ఈ వస్త్రాపహరణం వారి ఉత్తరీయాలు తొలగించడంలో ముగిసింది.

మహాశూరులైన పాండవుల్ని, ముందుగా దాసత్వం స్వీకరింపచేయడానికి ధర్మబద్ధంగా చేయవలసిన కార్యమేమిటని దుర్యోధనుడు కర్ణుని అడిగితే ఆయన దాస ధర్మాన్ని తెలియజేస్తాడు. అప్పుడు "ఇప్పాండవులయు, ద్రౌపదియు వస్త్రంబులపహరింపుమని" దుర్యోధనుడు తమ్ముడైన దుశ్శాసనుడ్ని ఆజ్ఞాపిస్తాడు.

సంస్కృత భారతంలో వేద వ్యాస మహర్షి చెప్పిందీ ఇదే. "పాండవానాంచ వాసాంసి ద్రౌపద్యాశ్చాప్య పాహిర."

ముందుగా పాండవుల వస్త్రాలను తొలగించడానికి దుశ్శాసనుడు సమీపించినపుడు అతనితో పని లేకుండా పాండవులే వారి ఉత్తరీయాలను తీసి క్రిందపెట్టారు. నన్నయ యీ సన్నివేశాన్ని ఎంతో చక్కగా చెప్పారు.

"కితవ వ్యవసాయ పరాజితులగుటం జేసి బలిమిచెడి
పాండు సుతుల్ ధృతి దమ పయి పుట్టము లాయత
కీర్తులు మున్న పెట్టి యా సభ నున్నన్."

అర్థం : జూద వ్యసనంతో ఓడిపోయి నందువలన బలాన్ని, కోల్పోయిన పాండవులు తమ పై వస్త్రాలను (ఉత్తరీయాలను) ఆ సభ ముందు పెట్టారు (అంతటితో వారి వస్త్రాపహరణం ముగిసింది).

దీనినే వ్యాస మహర్షి ఇలా వ్యక్తం చేశాడు.

"తచ్ఛ్రుత్వా పాండవాస్సర్వే స్వాని వాసాంగి
భారత అవకీర్యోత్తరీయాణి సుభాయాం
సముపావిశన్"

అర్థం ఆదాస ధర్మం విన్న పాండవులు అందరూ తమ తమ ఉత్తరీయాలను అవకీర్యం చేసి (తొలగించి) సభ ముందు పెట్టారు. అనగా రాచఠీవికి, గాంభీర్య దర్పాలకు ప్రతీకవైన ఉత్తరీయాలను తొలగించారని ఇంత స్పష్టంగా వుంది. దుశ్శాసనుడు తొలగించాల్సిన ఉత్తరీయాల్ని వారే తీసి దాసత్వాన్ని అంగీకరించారు.

ప్రాచీనకాలం నుండి నేటి వరకు ఉత్తరీయం లేదా పై వస్త్రం స్త్రీకి గాని, పురుషునికి గాని గౌరవాపాదకం. ఉత్తమ కులీనులూ, రాజకన్యలూ అయిన స్త్రీలు పై వస్త్రాన్ని మేలిముసులుగా ధరించడం నేటి నాగరికతలో అదే పై వస్త్రం రకరకాల దుస్తుల సింగారాల్లో విభిన్న రూపాల్లో దర్శనమివ్వడం మనం చూస్తున్నదే. నేడీ పై వస్త్రం సర్వజన సామాన్యమయింది.

ఈనాడు కూడా తమ యజమానులు కానీ, తమపై అధికారులుగానీ మార్గమధ్యంలో ఎదురైనపుడు సేవకులు, క్రింది ఉద్యోగులు వెంటనే తమ కండువాలను భుజంపై నుండి తొలగించి,

చంకనబెట్టి, చేతులు కట్టుకొని నిల్చుండటం మనం చూస్తుంటాం. ఇది తమ స్థానాన్ని తెలుపుతూ యజమానుల ఆధిపత్యాన్ని గౌరవించడం.

ధర్మరాజు, అతని నలుగురు తమ్ముళ్ళు తమ తమ ఆయుధాలు, అస్త్ర శస్త్ర కవచాలతో పాటు వస్త్రాలను కూడా దాస్యం మూలంగా విడిచి పెట్టాలని గుప్తార్థ ప్రకాశిక ప్రతిలో ఉంది (బాల వ్యాకరణకారుని).

"నెమ్మిని ధర్మజు నలువురు దమ్ములు దమ వస్త్రములయు
దమ శస్త్ర వరూ
ధమ్ముల తోడను సకల హితమ్ముగ బాయంగ వలయు
దాస్యము వలనన్"

పాండవులకు జరిగిన యీ వస్త్రాపహరణమే ద్రౌపదికి కూడా జరిగాలి. అనగా 'పయి పుట్టమునే' తొలగించాలి కాని కటి వస్త్రాన్ని కాదు. కాని ఆమె తొలగించలేదు. ముందు నేనెలా దాసినయ్యానో వివరించమంటుంది. ధర్మరాజు తానోడి నన్నోడెనా, నన్నోడి తానోడెనా" అని ప్రశ్నిస్తుంది. దీనర్థం ధర్మరాజు తనను ముందుగా పణంలో పెట్టి ఓడిపోయి ఉంటే నేనతని స్వాధీనంలోని భార్యనైనందువల్ల దాసత్వాన్ని అంగీకరించుదునేమో కాని అతడు ముందుగా ఓడిపోయినందువలన నాపై అధికారం ఉండదు. కారణం నేను ఆయన సోదరులకు భార్యను కాబట్టి, ఈ అర్థంలోనే ఆమె ప్రశ్నిస్తుంది. ముందు తాను దాసినో కాదో తేల్చమంటుంది.

ఈ ప్రశ్నకు ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. కాని ఒక విధంగా సంస్కృత భారతంలో భీముడు బదులిస్తాడు. ఈ సంఘటన నన్నయ తెనిగించలేదు. భీముడు చెప్పిన సమాధానమిది.

"ఈ ధర్మజుడు మాకు తండ్రితో సమానుడు. ఆయనే మాకు సర్వాధికారి. కాని యెడల యీ కౌరవుల అత్యాచారాలు ఇంతవరకు సహించి ఉండము. మాకు మాత్రమే కాదు మాకున్న సమస్తానికి, మా సదాచారం వల్ల ప్రాప్తించిన పుణ్యానికీ, తపఃఫలానికీ ఆయనే అధికారి. మా అన్న జూదంలో నన్నొడ్డి ఓడకపోయి ఉంటే భూమి మీద జీవించే ఏ ప్రాణి కూడా ద్రౌపదినిలా అవమానించి ప్రాణాలతో బ్రతికి ఉండటం అసంభవమయ్యేది.

ఇలా భీముడు బదులివ్వడంతో వారి భార్య అయిన ద్రౌపదిపై కూడా ధర్మరాజుకు సర్వహక్కులూ ఉన్నాయని విశదమయింది. అంతటితో దుశ్శాసనుడు ఆమె పై వస్త్రాన్ని తొలగించడానికి సమీపిస్తాడు. జగదేకవీరులైన పాండవుల పత్నిని దాసిగా నిర్ణయించడమే వారికి అతి పెద్ద అవమానం.

దాసధర్మాన్ని బట్టి కర్ణుడు చేసిన నిర్ణయాన్ని భీముడంగీకరించినట్లు, ఆ మేరకు అతనిపై కోపమేమీ లేనట్లు వ్యాస భారతంలో ఉంది. ద్రౌపది విషయంలో కర్ణుడు చెప్పిన దాస ధర్మం ఇది.

"అమ్మా! ఐశ్వర్యహీనుడై సేవా వృత్తిని జీవించే వ్యక్తి యొక్క భార్య, ధనం వాని యజమాని అధీనంలో ఉంటాయి. కాబట్టి నువ్వు దుర్యోధనుని పరిచారికగా ఉండాలి. పాండవులకు నీపై ఎలాంటి అధికారం లేదు. కౌరవులే నీ ప్రభువులు. జూదంలో నిన్ను ఫణంగా పెట్టని మంచి భర్తను ఎన్నుకో. భర్త ఆజ్ఞల్ని, పాలించే నీవంటి స్త్రీ నిందార్హురాలు కాదు. దాస స్త్రీకి ఇలాంటి స్వేచ్ఛా విహారానికి అవకాశం ఉంది."

ఈ ధర్మాన్ని విన్న భీముడిలా అంటాడు.

"నాహం కుప్యే సూతపుత్రస్య రాజన్!

నేష సత్యం దాస ధర్మః ప్రవిష్టః" (రాజా యీ సూతపుత్రుడైన కర్ణుని మీద నాకు కోపం లేదు. ఎందుకంటే ఇతడు సత్యమైన దాసధర్మాన్ని ప్రతిష్ఠించాడు)"

భీముని కోపమంతా దుర్యోధనుని పైననే. మంచి భర్తను ఎన్నుకోమని కర్ణుడు అనగానే "ఇంకెవరో ఎందుకు? నా అంక స్థలం పైననే అధివసించమని దుర్యోధనుడు సైగ చేస్తాడు. ఈ సైగను లేదా సూచనను చిలవలు పలవలు చేసి తొడగొట్టి మీసం మెలేసి చూపించడం జరుగుతున్నది.

ఏదేమైనా భర్తల ముందు అలా సైగ చేయడం దోషమే కాబట్టి రోషంతో దుర్యోధనుని తొడ విరగ్గొడతానని భీముడు ప్రతిన బూనాడు.

ద్రౌపదిని విపరీతంగా బాధించిన అవమానాల్లో ఒకటి సభాస్థిత దుర్భాషణం – అనగా సభలో 'దాసీ' అని నిర్ణయించి సంబోధించడం.

రెండవది కేశాపకర్షణం : అనగా జుట్టు పట్టి ఈడ్చుకొని రావడం. ఈ రెండు అవమానాలకే ద్రౌపది కుమిలి కుమిలి ఏడ్చింది.

1. దాస స్త్రీలు రాజులకు భోగ వస్తువులు. అదామెకు బాగా తెలిసిన విషయం. దాస స్త్రీ అందగత్తె అయితే ఎంతటి పరాభవాన్ని ఎదుర్కోవాలో విరాటరాజు కొలువులో కీచకుని దురాగతం, అతడి మోహం మనకు తెలియజేస్తుంది. కీచకుని కోరిక మన్నించనందుకు ద్రౌపదిని అతడు కూడా ఈడ్చుకొని పోతాడు. దాస స్త్రీలు పరిచర్య చేయడమే కాక ఇంతటి దైన్య స్థితిని అనుభవిస్తారు. అంతఃపుర కాంతగా, పట్టపు దేవేరిగా ఉన్న ద్రౌపది దాసిగా ఉండటం కంటే దారుణమైన అవమానం ఉండదు. జరిగిన సంఘటనలతో కలత చెందిన ధృతరాష్ట్రుడు ద్రౌపదిని పిలిచి జరిగింది మరచిపొమ్మని వరాలు కోరుకోమని అంటాడు. ఆమె రాజ్యాలు కాని, భర్తలు పోగొట్టుకున్న సంపదకాని వరంగా కోరుకోదు. అవి కేవలం వారి ప్రతాపంతో, భుజబలంతో సంపాదించుకోదగ్గవి. అందుకోసం ఆయుధాలు విడిపింపుమని కోరుతుంది. రెండవ వరంగా తన భర్తల్ని, 'దాసత్వం' నుండి విడిపించమంటుంది. తన కుమారుల్ని "దాసపుత్రులని" సంబోధించడం సహించలేనంటుంది.

2. మరో దుర్భరమైన అవమానం దుశ్శాసనుడామె కేశాలను పట్టి ఈడ్చుకొని వచ్చిన సంఘటన. దీనిని తలచుకొనినప్పుడామె తోకత్రొక్కిన త్రాచులా బుసలు కొడుతుంది. దుశ్శాసనుని తనువు తన తల వెంట్రుకలంత తునియలుగా తెగగొట్టినపుడే తన శిరోజాల యొక్క ఉడుకు ఆరుతుందని తీవ్రంగా పలుకుతుంది.

ఈ రెండు అవమానాలనే తరచుగా తలుస్తుంది కాని ఒకటి రెండు చోట్ల మామూలుగా తప్ప వస్త్రాపహరణం గురించి తలవదు.

ఆమె ఉత్తరీయం ధరించిందనడానికి సంస్కృత మనోభారతంలో స్పష్టమైన నిదర్శనం ఉంది.

దుశ్శాసనుడు రజస్వలాస్థితిలోనున్న ద్రౌపదిని సభకు ఈడ్చుకొని వస్తున్నపుడు ఆమె పై వస్త్రం (ఉత్తరీయం) జారిపోతూ ఉంటే దీనిని పైకి సర్దుకుంటూ వచ్చిందట.

"తాం కృష్యమాణాం రజస్వలాంచ
ప్రస్తోత్తరీయా మత దర్శమాణాం"

ఈ పై వస్త్రంతోనే ఆమెకు వస్త్రాపహరణం జరగవలసి వుంది. కాని జరగలేదు. జరిగింది వస్త్రాపహరణ ప్రయత్నం మాత్రమే. పై వస్త్రాన్నయినా తొలగించడానికి మహా కవులు ఇష్టపడలేదు. సమస్యలుత్పన్నమైనపుడు, సంఘర్షణ జనించినప్పుడు దైవం తోడ్పాటు అవసరం. అలౌకిక లేదా అతీత శక్తుల ప్రమేయంతో దురాగతం ఆపబడుతుంది. ఇదేమీ నేల విడిచి సాము చేయడం కాదు. భక్తి తత్పరత పాదుకొల్పడం అన్నది పురాణ దృక్పథం.

ధర్మం వెంట ఇతిహాసం నడుస్తుంది కాని ఇతిహాసాన్ని బట్టి ధర్మం నడవదు. ప్రతి విషయం ధర్మానుబద్ధంగా జరిగిన ఆ కాలంలో ఒక స్త్రీకి, అందునా మహావీరులైన పాండవుల పత్నికి కట్టు వస్త్రం తొలగించారని చూపడం. చీర లాగుతుంటే ఆమె గోడుగోడున విలపిస్తూ సభంతా కలియదిరగడం వంటి సీన్లు అభిలషణీయం కాదు.

నన్నయ భారతంలోనూ, వ్యాసభారతంలోనూ ఆ ప్రయత్నం సఫలం కాకుండా దైవశక్తి తోడ్పడింది. నన్నయ్య భారతంలో కేవలం ధవళ వస్త్రాలు మాత్రమే కృష్ణుడు అందిస్తే వ్యాస భారతంలో రంగు రంగుల వస్త్రాలు అందించాడు. అవి కుప్పలుగా పోగవుతుంటే దుశ్శాసనుడు లాగలేక కూలబడ్డాడు. అంటే పై వస్త్రం కూడా తొలగించబడకుండా ఉండటానికి ఇంతటి కల్పన తోడయింది. రెంటీ ధర్మభంగం కాకుండా చూడటానికి ఆమె శ్రీకృష్ణుడ్ని తలవడం. ఆయన అక్షయ వస్త్రాలివ్వడం అనే పురాణ గాథాంశం తోడయింది.

నిజానికి పాండవులకి అవమానం జరిగిన సమయంలో వాళ్ళు సమస్తం కోల్పోయి అడవుల పాలయ్యేంతవరకు శ్రీకృష్ణుని కిదేమీ తెలియదు. ఆ సమయంలో ఆయన సముద్ర తీరంలో సాల్వునితో మహాయుద్ధం చేస్తూ అందులో మునిగిపోయాడట. యుద్ధం నుండి రాగానే సాత్యకి జరిగిన విషయం అంతా చెప్పి "కృష్ణా! నువ్వుంటే ఇంతటి నష్టం వారికి జరిగి ఉండేది కాదు. ఇరుపక్షాల వారికి సలహా ఇచ్చి ఉండే వాడివి" అంటాడు. కృష్ణుడే సాత్యకిని వారి గురించి వివరాలడిగాడు.

నిజానికి కొన్ని ధర్మాలు, వివరణలు, వర్ణనలు, ఆంధ్ర మహాభారతం కంటే సంస్కృత భారతంలోనే సమంజసంగా, కార్యాకారణ సంబంధాలతో విలువల కనుగుణంగా ఉన్నాయనిపిస్తుంది. కాని కొన్ని చోట్ల కవిత్రయం ఔచిత్యాన్ని, పాటించి మార్పులు చేర్పులు చేయడం నిజమే కాని రాయాల్సిన ప్రముఖమైన అంశాలు చాలా వాటిని అనువాదం చేయకుండా వదలి వేయడం జరిగింది. తన్మూలంగా విలువైన సమాచారం మనకందకుండా పోయింది. వ్యాస మహర్షి నిందించవలసిన సందర్భాల్లో పాండవుల్ని ఛీత్కరించాడు. మెచ్చుకొనే సందర్భాల్లో కౌరవుల్నీ పొగిడాడు. ఘనంగా వర్ణించాడు.

సారాంశమేమంటే దాన ధర్మాన్ని బట్టి ముందుగా పాండవులకు వస్త్రాపహరణం జరిగింది. అది ఉత్తరీయాలు తొలగించడంతో ముగిసింది. ద్రౌపదికి కూడా పై వస్త్రమే అపహరించాలన్న ప్రయత్నం జరిగింది. వారికి పై వస్త్రంతో జరిగితే ఆమెకు (క్రింది) కట్టు చీరతో జరగదు. మనం తెలుసుకోవలసిన మరికొన్ని విషయాలున్నాయి. అవి ద్రౌపది గురించిన అనేకమైన అపనిందలు.

1. బహు భర్తృత్వం : ఇది ఒకనాటి ధర్మబద్ధమైన వివాహం. సాంప్రదాయం ఏకపత్నీ విధానం, బహు పత్నీకం వలెనే బహు భర్తృత్వం. ఒక వివాహ విధి.

2. ద్రౌపది నవ్వు : మయసభలో దుర్యోధనుని భంగపాటుకు ద్రౌపది నవ్వడం. ఇది అతని కలతకు కారణం కానేకాదు. అతడి దృష్టిలో ఆమె నవ్వు ఎగతాళి ఏమాత్రం కాదు.

3. కర్ణునిపై మనసు : ఇది చాలా తప్పుడు అభిప్రాయం. ఆమె కర్ణుణ్ణి తీవ్రంగా ద్వేషిస్తుంది.

4. బంధకి : ఇది తిట్టు. దూషణ కాదు. పేరు.

5. పక్షపాతి : అర్జునునిపై మరింత ప్రేమ కలిగి ఉండటం. పక్షపాతం కాదు. ఆమెను సహజంగా గెలిచిన వాడు. మనసు దోచుకున్నవాడు. అసలు భర్త.

6. జన్మవృత్తాంతం నాలాయని : పూర్వజన్మలో పతిందేహి అని 5సార్లు శివుని కోరడం. ఆయన ఐదుగురు పతుల్ని ప్రసాదించడం. ఇది ఒక పురాణ గాథాంశం. బహు భర్తృత్వానికొక సమర్థన.

పై సంఘటనలే కాక మహాభారతంలోని పాత్రలన్నీ, ప్రతీకాత్మకమైనవిగా వివరణ కర్తవ్యమైనవి. వీటిని మరోసారి చర్చిద్దాం.

బంధకి :
ఏక భర్తృకను నారీ అంటారు
నలుగురు భర్తలున్న స్త్రీని పతిత అన్నారు.
ఐదుగురు భర్తలున్న భార్యను బంధకి అని పేరు
ఇద్దరు భర్తలున్న స్త్రీ లౌకిక
సంతానార్థమై నియోగ విధానాన్ని ఆచరించిన స్త్రీని పరస్మృత అంటారు.

ఏకో భర్తాహి నారీణాం
కౌమార ఇతి లౌకికః
ఆపత్సుచ నియోగేన సంతనార్థే పరస్మృతః
గచ్ఛేతయా తృతీయంతు తస్యా నిష్కృతి రుచ్యతే
చతర్థీ పతితా
ధర్మాతే పంచమే బంధః భవేతే (స్మృతికాంశ)

కథ

# ప్రేమే కావాలి



- ఎం.వి.జె. భువనేశ్వరరావు

**'కాశీ' వెళ్ళే రైలు. పట్టాలపై పరుగులు తీస్తోంది. సుబ్బారావుగారి ఆలోచనలు సైతం అంతకన్నా వేగంగానే పయనిస్తున్నాయి.**

**సుబ్బారావుగారి ఇద్దరబ్బాయిలూ బాగా చదువుకున్న వారే. చదువులు పూర్తయ్యేక విదేశాల్లో ఉద్యోగాలు చేస్తున్నారు. ఒకరు అమెరికాలో ఉంటే, మరొకరు జర్మనీలో ఉంటారు. పెళ్ళిళ్ళు కూడా కావడంతో భార్యా పిల్లలతో కలిసి అక్కడే ఉంటున్నారు.**

నిజానికి ఏ తల్లిదండ్రులైనా గాని తమ పిల్లలు అంతటి స్థాయిలో ఉంటే గర్వంగా, సంతోషంగా భావిస్తారు. కాని ఈ విషయమే సుబ్బారావుగారి ఆందోళనకు పదే పదే కారణమవుతోంది. తానొక 'ఒంటరి' అనే భావాన్ని రగిలిస్తోంది. పిల్లల చదువులూ, ఉద్యోగ బాధ్యతలూ సుబ్బారావుగార్కి బంధువులు, మిత్రులతో కలిసి ఉండే సమయాన్ని లేకుండా చేశాయి. తన మొత్తం జీవితాన్ని వారి కోసమే ధారపోశాడు. ఇప్పుడు చివరికిలా బాధపడుతున్నాడు.

“అయ్యగారూ అమ్మగారికి టాబ్లెట్ వేసే టైమయ్యింది. వేసేద్దామా సారూ... సుబ్బారావుగార్కి ఆలోచనా భంగం కలిగిస్తూ చెప్పాడు శీనయ్యా.

సుబ్బారావుగారి భార్య రుక్మిణమ్మకి ఇటీవలే గుండె ఆపరేషన్ అయింది. నెమ్మదిగా కోలుకొంటున్న సమయంలోనే 'కాశీ' యాత్ర చేద్దామని పట్టుబట్టింది.

తన జీవన సహచరి. తన ఒక్కగానొక్క స్నేహితురాలు రుక్మిణి కోరికను తీర్చకపోవటమా?

తీర్చే తీరాలి.

అనుకోకుండానే ఈ 'కాశీ ప్రయాణం' నిర్ణయమవటంతో డాక్టరు గారి సలహాలు, సూచనలు తీసుకొని బయలుదేరారు. శీనయ్య సహకారంతో సుబ్బారావుగారు రుక్మిణమ్మకి టాబ్లెట్ వేసి పడుకోబెట్టారు.

మరలా సుబ్బారావుగారు ఆలోచనల్లోకి జారిపోయారు.

.. .. ..

కనీసం రోజులో ఒక్కసారైనా మాట్లాడాలనిపిస్తుంటుంది సుబ్బారావుగార్కి. కాని ఏ అబ్బాయి దొరకడే..!

ఇక్కడ రాత్రయితే అక్కడ పగలంట...

వాళ్ళంతా ఎలా ఉన్నారోననే బెంగయితే సుబ్బారావుగార్ని విడిచిపెట్టదు. రాత్రంతా మేలుకుని, వారితో ఫోన్ సంభాషణ సంపూర్ణంగా, తృప్తిగా చేద్దామంటే వారా అవకాశం ఇవ్వరు. ముక్తసరిగా సమాధానం చెప్పి, సంభాషణను మధ్యలోనే నిలిపివేస్తారు.

వాళ్ళంతట వాళ్ళే ఫోన్ చేస్తారనుకొంటే, అది ఎన్నటికీ జరిగేటట్లు లేదు.

అమెరికాలో ఏ మూల ఏ ప్రమాదం జరిగినా, తన బిడ్డేమో అని సుబ్బారావు గారికి గుండె గతుక్కుమంటుంది. జర్మనీలో ఏ ఉగ్రవాద దాడి జరిగినా, జాతి వివక్షత సంఘటన చోటు చేసుకున్నా ఆతృతగా, ఆందోళనగా ఉంటుంది. టివి వార్తల్లోనూ, పత్రికల్లోనూ నిర్ధారించుకున్నాక గాని మనసు కుదుటపడదు. జీవితమంతా ఈ వేదనతోనే కృంగి, కృశించి పోతోంది. రోజూ చచ్చేంత బాధ పడేకన్నా, ఒక్కసారిగా చచ్చిపోవడం మేలేమో! ఇంతలా తనని దుఃఖానికి గురిచేస్తున్న 'వ్యవహారం'కి ఎన్నటికీ ముగింపు ఉండదా?

పిల్లల ప్రతిస్పందన తను కోరుకున్నట్లు లేకపోవడమైతే సుబ్బారావుగార్ని అనుక్షణమూ వేధిస్తోంది. ఇందుకోసమా తానిన్ని కష్టాల్ని ఎదుర్కొని, త్యాగాల్ని చేసి పెంచి పెద్ద చేసిందని బాధనిపిస్తోంది. తను కూర్చున్న కొమ్మను తానే నరుక్కొన్నానా అని కూడా అనిపిస్తోంది. వారినా స్థాయిలో చూడాలని కోరుకున్న మాట నిజమే. కాని దాని పర్యవసానాలింత దారుణంగా ఉంటాయని తెలుసుకోలేక పోవడమే తన అవివేకం.

ఊర్లో వాళ్ళంతా, బంధువులంతా తమ పిల్లా పాపలతో, కొడుకూ కోడళ్ళతో హాయిగా ఉంటుంటే, తానేమో అందరూ ఉన్న అనాథ అయ్యేడు.

"ఆయనకేం... పిల్లలిద్దర్నీ చదివించి, అమెరికా పంపాడు. లక్షల రూపాయలు నెల నెలా వచ్చేస్తుంటాయ్..." అని జనవాక్కు. అనారోగ్యానికి గురయితే చూసే దిక్కెవడని సుబ్బారావుగారి ఆవేదన. చూడటానికి పెద్ద సముద్రమే. తాగడానికి నీళ్ళ లేవన్నట్లుంది సుబ్బారావు గారి దుస్థితి.

అయితే ఇలా ఇంకెన్నాళ్ళు?

జీవితమంతా ఇలాగే గడిచిపోతుందంటే ఆ జీవితమే వద్దు. ఏదో ఒకటి చెయ్యాలి.. వారి కళ్ళు తెరిపించాలి. సుబ్బారావుగారు గట్టిగా తీర్మానించుకున్నారు..

అనుకున్నదే తడవుగా పిల్లలిద్దరికీ ఫోన్ చేశారు.

"ఒరేయ్... మీ అమ్మకు గుండెపోటు వచ్చింది. అర్జెంటుగా శస్త్ర చికిత్స చెయ్యాలంటున్నారు... దానికే ఏర్పాట్లు చేస్తున్నాను.. మీరు కూడా దగ్గరుంటే నాకు ధైర్యంగా ఉంటుంది. అదీ సంతోషిస్తుంది..."

"లేదు నాన్నా... ఈ సమయంలో పిల్లల స్కూలు అడ్మిషన్లు ఉన్నాయి... పేరెంట్స్ ఉండి తీరాలి... ఏదోలా ఆపరేషన్ చేయించెయ్..." అని ఒకరంటే –

"ఇప్పుడు అమెరికాలో స్లంప్ నడుస్తోంది.. ఈ టైంలో లీవ్ తీసుకున్నామా... ఉద్యోగాలు గోవిందా... ఉంటా డాడీ..." అని మరొకరు చెప్పేశారు.

సుబ్బారావుగార్కి కన్నీరు వచ్చినంత పనయింది.

చేసేదేం లేక మిన్నకుండిపోయారు.

.. .. ..

మరో రెండు నెలలు గడిచాయి.

సుబ్బారావుగారు తన ప్రయత్నం ఆపలేదు. మరొక్కసారి పిల్లలిద్దరితో మాట్లాడాలని ఫోన్ చేసి చెప్పారు.

"మీ అమ్మ ఆరోగ్యం కాస్త కుదుటపడింది. పెద్దోడ్ని, చిన్నోడ్ని చూడాలనీ ఒకటే మారాం చేస్తోందిరా... దయచేసి వీలు చూసుకుని రండిరా... పాపం కన్న ప్రాణం కదా, ప్రాణాలు మీమీదే పెట్టుకొని బ్రతుకుతోంది...

"అమ్మ ఆరోగ్యం కుదుటపడిందిగా... భయం లేదులే... ఈసారికిక రాను... వచ్చే సంవత్సరం వస్తానులే" అని ఒకడంటే.. "నేనొచ్చేవాడ్నే డాడీ... మా మాంగారు, అత్తగారు, బావమరిది అందరూ ఇక్కడికి వచ్చే ఉన్నారు. వాళ్ళ నొదిలి రావడం బాగుండదుగా... తర్వాత వస్తాను డాడీ" అని మరొకడన్నారు. సుబ్బారావుగారికి నిజంగా గుండాగినంత పనయ్యింది... అంతేకాకుండా నిజంగానే ఏడుపొచ్చేసింది. ఆ షాక్ నుండి తేరుకుని మాట్లాడే లోపలే అవతల ఫోన్ పెట్టేసిన శబ్దమైంది.

.. .. ..

రుక్మిణమ్మకు 'కాశీ'ని చూపించగలిగాననే సంతృప్తయితే మిగిలిందిగాని, కన్న కొడుకుల్ని చూపించలేక పోయాననే ఆవేదనయితే మాత్రం సుబ్బారావుగారి శరీరంలోని అణువణువునూ దహించి వేస్తోంది...

పిల్లలపై ఉండాల్సిన 'ప్రేమ' స్థానంలో 'పగ' చోటు చేసుకునే పరిస్థితులు దాపురిస్తున్నాయ్...

అనుకున్నది కాకపోతే 'అహం' దెబ్బతింటుంది. అయినవారితోనే ఆ ఆటంకం ఎదురైతే బ్రతుకే వ్యర్థమనిపిస్తుంది.

పిల్లల ప్రవర్తన సుబ్బారావుగారిలో నిస్పృహను కలిగిస్తోంది. వారంటేనే రాను రాను విసుగొచ్చేస్తోంది.

మిగిలినవి రెండే మార్గాలు.

ఒకటి భార్యతో కలిసి ఆత్మహత్య చేసుకుని చచ్చిపోవటం!

ఎందుకంటే ఒకరు లేకపోతే రెండవ వారు బ్రతకగలగడం అసాధ్యం కాబట్టి!

ఇక రెండవది - పిల్లల్నిక్కడికి రప్పించడం. ఈసారి కూడా వాళ్ళని రప్పించలేకపోతే - ఇక మిగిలింది మొదటి మార్గమే.

సుబ్బారావుగారిలో ఏదో తెలీని 'తెగింపు' కలుగుతోంది. ఏం చెయ్యాలో బాగా ఆలోచించి నిర్ణయం తీసుకున్నారు. పిల్లలిద్దరికీ ఫోన్ చేశారు.



"ఒరేయ్ మిమ్మల్ని చూడాలని పరితపించిన మీ అమ్మ గుండె ఆగి పోయిందిరా.. శాశ్వతంగా ఆగిపోయింది. ఇక మీరొచ్చి "తలకొరివి" పెడితే కొంచెమైనా తృప్తిగా ఆమె జీవాత్మ పైకి పోతుందిరా... మీ కోసమే నేనూ, మీ అమ్మ శవమూ ఎదురు చూస్తుంటాం...రా..."

ప్రాథేయపూర్వకంగానే చెప్పారు. కన్నీళ్ళు దిగమ్రింగుకుంటూ! ప్రక్క నుండి రుక్మిణమ్మ వారిస్తున్నా సుబ్బారావుగారు విన్పించుకోలేదు.

అవతలివేపు నుండి కొంచెం సేపు మౌనం!

వారి భార్యల సలహా తీసుకుని చెప్పటం కోసమేమో ఆ ఆలస్యం!

"కొంచెం అర్థం చేసుకోండి నాన్నా... ఇప్పుడు మేం వచ్చి చేసేదేమీ లేదు.. ఎలాగూ అమ్మ చచ్చిపోయిందిగా... విమాన ఛార్జీకయ్యే ఖర్చులు మేం పంపించేస్తాం... అమ్మ పేరున ఘనంగా భోజనాలు ఏర్పాటు చేయండి... లేదు మేమే తలకొరివి పెట్టాలన్నది మీ మొండి పట్టుదల అయితే... ఆ ఛార్జీలతోనే మీరు అమ్మ శవాన్ని తీసుకుని - ఇక్కడ కొచ్చేయండి... తమ్ముడూ నేనూ కలిసి, ఓ వీకెండ్‌లో తలకొరివిపెట్టి - దహనం చేయించేస్తాం.... ఇంతకన్నా మేం చేసేదేం లేదు..." ఫోన్ పెట్టేశారు.. లౌడ్ స్పీకర్‌లో రుక్మిణమ్మ వాళ్ళు చెప్పిందంతా విని, కన్నీళ్ళు బొట బొటా రాల్చుకుంది. ఆపరేషన్ అయిన ఆ గుండె - అంతటి షాక్‌ని తట్టుకోలేకపోయింది. ముసలిదైన, నీరసపడిపోయిన ఆ గుండె నిజంగానే ఆగిపోయింది.

సుబ్బారావుగారి ఏడుపూ, హృదయ ఘోషతో ఆ ఇల్లు దద్దరిల్లి పోయింది. గుండెలవిసేలా ఏడ్చి, సుబ్బారావుగారు ఒక గట్టి నిర్ణయం తీసుకున్నారు. వీలయినంత తొందరగా రుక్మిణమ్మకు తోడుగా వెళ్ళిపోవాలన్నదే ఆ తాజా నిర్ణయం. అయితే ఆ ముందు చెయ్యాల్సిన పనొకటుంది. సుబ్బారావుగారి పేరునున్న మొత్తం ఆస్తులకూ వీలునామా రాయటం! ఆ తర్వాతే ఆత్మహత్య చేసుకుని చనిపోవటం!!. శీనయ్య, సుబ్బారావుగారు సంయుక్తంగా తలకొరివి పెట్టి రుక్మిణమ్మ దహన సంస్కారాన్ని పూర్తి చేశారు. ఇక తర్వాత ఆస్తులకు సంబంధించి వీలునామా రూపొందించడమే మిగిలింది. సుబ్బారావుగారు ఆస్తులకు వీలునామా రూపొందించే పనిలో ఉన్నారనే విషయం కొడుకులిద్దరికీ తెలిసిపోయింది. వెంటనే ఫోన్‌ల తాకిడి మొదలైంది. సుబ్బారావుగారి ఫోన్ వాటికి స్పందించలేదు.

.. .. ..

ఊరులోని నిరుపేదలూ, అనాథలూ అక్కడికి చేరుకున్నారు.. ఊరిపెద్దల్నూ, న్యాయవాదుల్నూ కూడా సుబ్బారావుగారు పిలిపించారు. అందరూ ఆసక్తిగా ఎదురు చూడసాగారు. సుబ్బారావుగారు తన ఉద్దేశాన్ని బయటపెట్టారు... "నేనిన్నాళ్ళూ నా సంతానం అభివృద్ధి చెందాలని పరితపించాను. వారి కోసమే నా జీవితాన్ని ధారపోశాను.. వారికి చదువునైతే చెప్పించగలిగాను గాని సంస్కారాన్ని నేర్పించలేకపోయాను... వారికి నా డబ్బు కావాలి గాని నేనూ, నా భార్యా అక్కరలేదు. వారినే సహాయమూ అడగలేదు. కేవలం ఒక్కసారి చూసి వెళ్ళమన్నాను. అది కూడా వారికి అక్కరలేనిదయిపోయింది. దాంతో నేనో నిర్ణయానికొచ్చాను. మేమక్కరలేని వారికి మా రెక్కల సంపాదన మాత్రం ఎందుకివ్వాలి?... పాకిస్తాన్‌లోని అనాథలందరికీ తండ్రి లేడనే బాధ లేకుండా ఆ దేశాధ్యక్షుడు జర్దారీ స్వయంగా వారి తండ్రి పేరు స్థానంలో తన పేరు రాయమని ఆదేశించాడట.. నేనూ దాన్నుండి స్ఫూర్తి పొందుతున్నాను. ఈ ప్రాంతంలో ఉన్న అనాథలైన వారందరికీ నేనే తండ్రిగా ఉంటా... నా బాధ్యతగా వారికి కొంత ఆస్తినిస్తా... నిరుపేదలకి కూడా నా రెక్కల కష్టాన్ని పంచుతా.. ఆ పని కానివ్వడానికే ఈ కలయిక... మీరంతా నాకు సహకరించండి..." అందరి కళ్ళు చెమ్మగిల్లాయి.. అందరూ సుబ్బారావుగారి కాళ్ళని ఆనందాశ్రువులతో తడిపేశారు. చివర నుండి ఆఘమేఘాల మీద అమెరికా, జర్మనీల నుండి వచ్చిన కొడుకులిద్దరూ "నాన్నా... తొందరపడకండి" అని అరుస్తున్నారు... సుబ్బారావుగారికే కాదు.. అక్కడెవరికీ ఆ మాటలు విన్పించడం లేదు.

**సెల్ : 9290072130**

- సౌభాగ్య
సెల్ : 9848157909



# లియొనార్డో సినిస్‌గల్లి

## *(Leonardo sinisgalli)*

**1908 - 1981**




సినిస్ గల్లి పొటాంజా ప్రాంతంలోని మోంటెముర్రోలో జన్మించాడు. ఆయన కవి, కళా విమర్శకుడు. వృత్తిరీత్యా ఇంజనీరు. ఆయన్ని 'ఇంజనీరు కవి' అనేవాళ్ళు.

1925లో రోం నగరం చేరి ఇంజనీరింగ్, మాథమాటిక్స్ చదివాడు. 1932లో ఇంజనీరింగ్ డిగ్రీ అందుకుని మిలాన్ నగరం చేరి అక్కడ ఆర్కిటెక్ట్‌గా, గ్రాఫిక్ ఆర్టిస్టుగా పనిచేశాడు. సుప్రసిద్ధ కవి గియొసెట్టె ఉంగరెట్టికి సినిస్‌గల్లి సన్నిహిత మిత్రుడు. చిత్రకారుడైన స్కివియోన్‌కు ఆత్మీయుడు.

సినిస్ గల్లి 'Cuore, 18 Poesie, Com pi elisi' అన్న తొలి కవితా సంపుటాలు దక్షిణ ఇటలీ పురాణగాథల్ని ఆధారం చేసుకున్నవి.

తరువాత రచనల్లో ఆయన ధోరణిలో వెసులుబాటు, వైవిధ్యం చోటు చేసుకున్నాయి. అధివాస్తవిక వాదం, వాస్తవికతావాదాల గురించి వాటిల్లోని వైరుధ్యాల గురించి విశ్లేషిస్తూ రచనలు చేశాడు. సమకాలీన శాస్త్రీయ, వైజ్ఞానిక జీవితాన్ని విశ్లేషిస్తూ కూడా రచనలు చేశాడు.

1953 నుండి 1959 దాకా 'Civilta delle macchine', అన్న పత్రిక నడిపాడు. రేడియో కార్యక్రమాల సంపాదకుడుగా కూడా పనిచేశాడు. రెండు డాక్యుమెంటరీలు తీశాడు. 'Biennale di venezia' అన్న అవార్డు పొందాడు.

బాల్యమే బతుక్కి పునాది అని భావించిన భావుకుడాయన. ఆయన కవితల్లో కోల్పోయిన దాని అన్వేషణ వుంది. జ్ఞాపకాల తెరలున్నాయి.

స్వచ్ఛమైన బాల్యంలాగే స్వచ్ఛమైన కవిత్వం కోసం ఆయన తపించారు.

### ఉదయం పెరుగుతూ ఉంటుంది

పగలు పొయ్యి నించే మొదలై పెరుగుతూ వుంటుంది
నక్షత్రాలు నిద్రపోడానికి వెళ్ళిపోతాయి
పగటి గాలి వాటిని పక్కకు తోసేస్తుంది
పక్కకు వొరిగిన గోధుమ బల్లేలు ఫీంకరిస్తాయి
ఆ దృశ్యాన్ని మరీ అంతగా కన్నార్పకుండా చూడలేం
నీ చేతినించే అలసిన బంగారు మెరుస్తుంది
భూమిని కౌగిలించిన నీ హృదయం
మట్టిని వెచ్చబరుస్తుంది
కాంతిలో నీ తల పెద్దగా కనబడుతుంది
ఇప్పుడు సూర్యుడు భూమిపైకి లేస్తాడు
బలంగా లేస్తాడు
బలమైన కాముకత్వంతో విజృంభిస్తాడు

### పాత కన్నీళ్ళు

ముసలివాళ్ళకు
ఏడుపు తొందరగా వస్తుంది
మధ్యాహ్నం వేళ
ఖాళీగా వున్న ఇంట్లో
ఎవరూ గుర్తుపట్టని చోట
వాళ్ళు చేరి కన్నీళ్ళు పెట్టుకుంటారు
తక్షణ విషాదం
వాళ్ళని ఆశ్చర్యంలో ముంచెత్తుతుంది
వాడిపోయిన పళ్ళ ముక్కలేవో
వాళ్ళు కొరుకుతూ వుంటారు
ఎదురింటి ముందు
ఎండబెట్టిన వడియాల్లా వాడిపోయి వుంటారు
వాళ్ళ సంక్షోభాన్ని ఒక్క చుక్క నీళ్ళు పరిష్కరిస్తాయి
నత్త లాంటి వాళ్ళ చూపు నవనవలాడడానికి
ఒక్క చుక్క నీరు చాలు



## ఢిల్లీ ప్రపంచ పుస్తక మహోత్సవం

# ఊపందుకుంటున్న ఇ బుక్స్, ఆన్‌లైన్ అమ్మకాలు...




- గుడిపూడి విజయరావు

**నలభై ఏళ్ల క్రితం నేషనల్ బుక్ ట్రస్ట్ ఆధ్వర్యంలో కేవలం 250 మంది ప్రచురణకర్తలతో, విండ్సర్ ప్యాలెస్‌లో తొలి ప్రదర్శన ప్రారంభం కాగా ఇప్పుడు అతి విశాలమైన ప్రగతి మైదానంలో 45,000 చదరపు మీటర్ల వైశాల్యం కలిగిన 10 విశాలమైన హాళ్లలో 2,500 స్టాళ్లతో, 1,300 మంది నేడు పాల్గొనడాన్నిబట్టే రెండేళ్లకో సారి జరిగే ఢిల్లీ పుస్తక మహోత్సవం ఎంతగా విస్తరించిందో తెలుసుకోవచ్చు.**

గత ఫిబ్రవరి 25 నుండి మార్చి 4 వరకు ఢిల్లీలో జరిగిన 20వ ప్రపంచ పుస్తక మహోత్సవం నేడు పుస్తక ప్రపంచంలో చోటుచేసుకుంటున్న నూతన ధోరణులకు అద్దం పట్టింది. సంప్రదాయ పుస్తక ప్రచురణ ఒకవైపున వేగంగా కొనసాగుతూ, విస్తరిస్తుండగానే ఇ బుక్స్, ఆన్‌లైన్ ట్రేడింగ్ లాంటి పరిణామాలు ఊపునందు కుంటున్నాయని ఈ ప్రదర్శన చూసినపుడు స్పష్టంగా అర్ధమవుతుంది. నలభై ఏళ్ల క్రితం నేషనల్ బుక్ ట్రస్ట్ ఆధ్వర్యంలో కేవలం 250 మంది ప్రచురణకర్తలతో, విండ్సర్ ప్యాలెస్‌లో తొలి ప్రదర్శన ప్రారంభం కాగా ఇప్పుడు అతి విశాలమైన ప్రగతి మైదానంలో 45,000 చదరపు మీటర్ల వైశాల్యం కలిగిన 10 విశాలమైన హాళ్లలో 2,500 స్టాళ్లతో, 1,300 మంది నేడు పాల్గొనడాన్నిబట్టే రెండేళ్లకో సారి జరిగే ఢిల్లీ పుస్తక మహోత్సవం ఎంతగా విస్తరించిందో తెలుసుకోవచ్చు. పుస్తకాల పట్ల నిరంతరం పెరుగుతున్న ఆసక్తికి, ఆదరణకు కూడ ఇది నిదర్శనం. గత రెండు మూడు ప్రదర్శనలు తిలకించిన మాకు ప్రతి సారి కొత్త కొత్త విషయాలు అర్థం అవుతూ వచ్చాయి. ఈ ప్రదర్శనలో గతం కన్నా మరిన్ని ఎక్కువ నూతన అంశాలు కనిపించాయి.




పుస్తకాల టోకు వ్యాపారం, హక్కుల అమ్మకాలు, కొనుగోళ్లు మాత్రమే జరిగే ఇతర అంతర్జాతీయ పుస్తక ప్రదర్శనలకు కొంత భిన్నంగా ఢిల్లీ ప్రదర్శనలో రీటైల్ అమ్మకాలకూ సమాన ప్రాతినిధ్యం లభిస్తుంది. ప్రతిరోజు వేల సంఖ్యలో పుస్తకాభిమానులు ప్రదర్శనను తిలకించేందుకు వస్తుండటంతో ప్రచురణ కర్తలు ఈ అవకాశాన్ని తమ ప్రచురణల ప్రచారానికి కూడ వినియోగించుకుంటారు. అందుచేతనే స్టాళ్లను ఆకర్షణీయంగా రూపొందించడం కూడ ఇక్కడ ఓ ప్రధాన అంశం. బాలల పుస్తకాలను ప్రదర్శించిన హాలు గురించి ఈ విషయంలో ముందు చెప్పుకోవాలి. చిల్డ్రన్స్ బుక్ ట్రస్టు, స్కాలస్టిక్ లాంటి ప్రచురణ కర్తలు స్టాళ్ల అలంకరణకు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నట్లు కనిపించింది. కేవలం ఆకర్షణీయంగా అలంకరించడమే కాకుండా బాలల పుస్తక ప్రచురణలో తాము అనుసరిస్తున్న నూతన మార్గాలను కూడ స్పష్టంగా వ్యక్తం చేసే ప్రయత్నం జరిగింది. బడా ప్రచురణకర్తలు భారీ బడ్జెట్లతో పెద్ద ఎత్తున బాలసాహిత్యం లోకి ప్రవేశించడం కూడ కనిపించింది. ఇంటర్నెట్ అధిక ప్రాచుర్యంలోకి రావడంతో ఇటీవల కాలంలో ఇ.పోర్టల్స్ అధిక ఆదరణ పొందుతున్నాయి. బాలలకు టెక్స్ట్‌తో పాటు గ్రాఫిక్స్, ఆడియో-విడియో, యానిమేషన్ల ద్వారా ఆన్‌లైన్ ద్వారా అందించడం పెరుగుతున్నది. గురుకుప్పో, కొండోవా లాంటి ప్రచురణ కర్తలు తమ వెబ్ పోర్టల్స్ ప్రదర్శనకు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. సిడిలు, మ్యాప్‌లు, విద్యాపరమైన ఆటసామగ్రి లాంటి వాటికి ప్రముఖ స్థానమే లభించింది. 3డి పుస్తకాలు ఈ ప్రదర్శనలో ఓ ఆకట్టుకునే అంశం. ఈ పుస్తకాలతో పాటు 3డి కళ్లద్దాలను కూడ విక్రేతలు అందచేస్తున్నారు.

ఈ ప్రదర్శనలో ప్రతి ఒక్కరిని తప్పనిసరిగా ఆకర్షించినది ఫ్లిప్‌కార్ట్ స్టాల్. భారత దేశంలో పుస్తకాల ఆన్‌లైన్ విక్రయరంగంలో అగ్రగామి సంస్థ తన స్టాల్‌ను కూడ ప్రత్యేకతరహాలో రూపొందించింది. మొత్తం ప్రదర్శనలో ప్రతిస్టాల్‌లోను అదనపు ఆకర్షణలు ఎన్ని ఉన్నా పుస్తకాలదే ప్రధాన స్థానం. కాని విశాలమైన ఫ్లిప్‌కార్ట్ స్టాల్‌లో పుస్తకాలు ఏమీ కనిపించవు. పెద్ద సంఖ్యలో కంప్యూటర్లు మాత్రమే ఉన్నాయి. దాన్ని ఆశ్చర్యంగా తిలకించిన ప్రతి ఒక్కరికీ వివరించేందుకు



ఎం.ఏ. సికందర్, ఎన్‌బిటి డైరెక్టర్

సహాయకులూ అక్కడ పుష్కలంగా ఉన్నారు. ఎవరు ఏ పుస్తకం కావాలని అడిగినా కంప్యూటర్‌లో తమ సైట్‌కు వెళ్లి అన్వేషించి ఆర్డర్ పెట్టమని వారు సూచిస్తున్నారు. పుస్తకాలకు చెల్లింపులు మాత్రం మన ఇంటి వద్దనే, అవి చేరిన తర్వాత. ఎంతో సదుపాయంగా ఉన్న ఫ్లిప్ కార్ట్‌లో వివిధ అంశాలకు చెందిన పదుల లక్షల సంఖ్యలో టైటిల్స్ ఉన్నాయి. వాటిలో దేన్ని కావాలనుకున్నా ఆర్డరు చేయవచ్చు. అందుచేతనే, బాలల దగ్గర నుండి, టీనేజర్లు, యువకులు, మధ్య వయస్సు వారు, వృద్ధుల వరకు అన్ని వయోతరగతులకు చెందిన వారు ఆ స్టాల్‌లో కనిపించారు. ఇలాంటి దృశ్యాన్ని ప్రదర్శన మొత్తం మీద మరెక్కడా చూడలేము.

సైన్స్, టెక్నాలజీ, మెడికల్ పుస్తకాల ప్రచురణలను విడిగా ఓ హాలులో ప్రదర్శిం చడం ఈ సారి మరొక విశేషం. ఈ తరహా పబ్లిషర్లు 150 మంది పాల్గొన్నారంటేనే ఈ విభాగం ఎంత అభివృద్ధి చెందిందీ అర్థం చేసుకోవచ్చు. బాగా తెలిసిన ఎన్‌సిఇఆర్‌టి, టాటా మెక్‌గ్రాహిల్ లాంటి టెక్నికల్ పుస్తక ప్రచురణకర్తలు, జేపీ బ్రదర్స్ లాంటి మెడికల్ పుస్తకాల ప్రచురణ కర్తలు మాత్రమే కాకుండా మరెందరో ప్రచురణకర్తలు తమ నాణ్యమైన ప్రచురణలను ప్రదర్శించారు. ఈ విభాగంలో మిగతా అన్ని రంగాలలో కన్నా ఆధునిక సమాచార సాంకేతిక పరిజ్ఞానాన్ని అనుసరించడం కనిపిస్తుంది. ఆయా ప్రచురణకర్తలు తమ పుస్తకాలపై తమ వెబ్ అడ్రస్‌లను జతచేయడం, పుస్తకం కొన్నవారికి దాని తదనంతర సమాచారాన్ని ఆన్‌లైన్ ద్వారా అందచేయడం కూడ అధికమవుతున్నదని తెలుస్తుంది. ఆన్‌లైన్ ద్వారా విదేశీ పుస్తకాలను పొందడం కూడ ఎంతో సులువయింది.

మరొక విశేషం, ఈ కాలంలో వాణిజ్య పుస్తకాల ప్రచురణ బాగా పెరిగిపోవడం. వాణిజ్య పుస్తకాలు అంటే కామర్స్ పుస్తకాలు కాదు. సంతోషం కోసం, సమాచారం కోసం అత్యధికులు చదివే పుస్తకాలు. ప్రచురణకర్తలకు వెనువెంటనే పెద్ద లాభాలు సంపాదించిపెట్టేవి. వాటిలో అత్యధికం కొన్నాళ్ల తర్వాత పాఠకులు మర్చిపోయినా ఆశ్చర్యపడనవసరం లేనివి. ఇలాంటి పుస్తకాల ప్రచురణకు ముందే ఆర్భాటం మొదలవుతుంది. వాటి గురించి పెద్ద ఎత్తున ప్రచారం జరుగుతుంది. అట్టహాసంగా వాటిని విడుదల చేస్తారు. వాటి రచయితలు దేశంలోని ప్రముఖ పుస్తకాలయాలకు వచ్చి తమ రచన గురించి పాఠకులతో సంభాషిస్తారు. ఇదంతా అమ్మకాలు పెంచుకోవడంలో భాగమే. వీటినే పుస్తక విక్రేతల భాషలో బెస్ట్‌సెల్లర్స్ అంటారు. నవలలు, కథలు లాంటి కాలక్షేపం పుస్తకాలు, కాల్పనిక చరిత్ర, సెల్ఫ్‌హెల్ప్, వంటలు లాంటివాటితో పాటు ఆర్ట్ కల్చర్ లాంటి పుస్తకాలూ ఈ కోవకే వస్తాయి. గతంలో ఇలాంటి ప్రచురణలు చిన్న చిన్న స్వతంత్ర ప్రచురణకర్తలు మాత్రమే తెస్తుండేవారు. కాని ఇప్పుడు పెంగ్విన్, మ్యాక్‌మిలన్, హార్పర్ కాలిన్స్, హాచిట్ తదితర ప్రధాన ప్రచురణకర్తలే దీనిలో ప్రవేశించారు. చిన్న ప్రచురణకర్తలు అదృశ్యమయిపోయారు. పెంగ్విన్ ఇండియా ప్రచురణ సంస్థ 25 ఏళ్లు పూర్తిచేసుకున్న సందర్భంలో ఓ అంబాసిడర్ కారును పెంగ్విన్ రంగులో అలంకరించి ఏకంగా స్టాల్‌లోనే నిలబెట్టడం ఇలాంటి ప్రచురణలకు బడా సంస్థలు ఎంత ప్రాధాన్యతనిస్తున్నాయో తెలుసుకోవడానికి ఓ స్పష్టమైన నిదర్శనం. ఈ తరహా పుస్తకాలను ఇంగ్లీషులోనే కాకుండా ప్రాంతీయ భాషల్లో సైతం పెద్ద పెద్ద ప్రచురణ కర్తలు తీసుకురావడం మరొక కొత్త పరిణామం.

ఈసారి ఢిల్లీ ప్రదర్శనలో గతంలో ఎన్నడూ లేనివిధంగా కనిపించిన మరొక అంశం ఉంది. ఇప్పటివరకు హైదరాబాద్ లాంటి చోట్ల మాత్రమే ఆధ్యాత్మిక స్టాళ్లు పెద్ద ఎత్తున దర్శనమిచ్చేవి. కాని ఈసారి ఢిల్లీ ప్రదర్శనలో సైతం వివిధ మతాలకు చెందిన స్టాళ్లు, పలువురు బాబాల స్టాళ్లు అధిక సంఖ్యలో చోటుచేసుకున్నాయి. ప్రతిసారి మాదిరిగానే ఈ ప్రదర్శనలోను హిందీ, ఇతర ప్రాంతీయ స్టాళ్లకు సముచితమైన ప్రాధాన్యత లభించింది. దక్షిణ భారత దేశంలోని అన్ని భాషల స్టాళ్లు ఇక్కడ ఉన్నాయి. మణిపురి, అస్సామీ లాంటి భాషాస్టాళ్ల నిర్వాహకులు కూడ తమ అనుభవం పట్ల సంతృప్తి వెలిబుచ్చారు. ఈ స్టాళ్ల ద్వారా ప్రధానంగా ఢిల్లీ నగరంలోని ఆయా భాషలకు చెందినవారితో సంబంధాలు పెట్టుకోవచ్చని ప్రాంతీయ భాషా ప్రచురణకర్తలు చెబుతున్నారు. అంతర్జాతీయ, విదేశీ ప్రచురణ సంస్థలు కూడ పెద్ద ఎత్తున ఈ ప్రదర్శనలో పాల్గొన్నాయి. మొత్తం 30 మంది ప్రచురణకర్తలు, సంస్థలు ఈ ప్రాంగణంలో ఉన్నాయి.

ఈ ప్రదర్శనలో తప్పనిసరిగా చెప్పుకోవలసింది అక్కడ జరిగిన పలు సెమినార్లు, వర్క్‌షాపుల గురించి. అనువాదాలపై రెండు రోజులపాటు సెమినార్ జరిగింది. కేంద్ర సాహిత్య అకాడమీకి కార్యదర్శిగా పనిచేసిన కె.సచ్చిదానందన్ పలు భాషల భారత దేశంలో చారిత్రకంగా అనువాద సాహిత్యానికున్న విశిష్ట స్థానాన్ని చక్కగా వివరించి, నేటి ప్రాధాన్యతను నొక్కి చెప్పారు. చరిత్ర, సైన్స్, జండర్ సంబంధిత, కాల్పనిక సాహిత్యం తదితర విభాగాలలో అనువాదాల గురించి సెమినార్లో వివరంగా చర్చించారు. మరొక ప్రధాన సెమినార్ హక్కుల క్రయవిక్రయాలకు సంబంధించినది. పుస్తకాల కాపీరైట్లు, అనువాదహక్కులు, పుస్తకాలను డిజిటలైజ్ చేసే హక్కుల లాంటి వాటి గురించి చర్చజరిగింది. పుస్తకాల హక్కుల గురించి అవగాహన పెంచుకోవడానికి, పుస్తకాల హక్కులను కొనుగోలు చేయడానికి ఈ సెమినార్లో జరిగిన చర్చలు, సంప్రతింపులు బాగా దోహదపడ్డాయని ప్రచురణకర్తలు అభిప్రాయపడ్డారు. ఈ ప్రదర్శన నిర్వహణలో మొత్తం తానే అయి కనిపించిన ఎన్‌బిటి డైరెక్టర్ ఎం.ఏ. సికందర్ పాత్ర తప్పనిసరిగా గుర్తించాలి.



# సినీవాలికి ఆముఖం

- డాక్టర్ ఆవంత్స సోమసుందర్

**అరుదుగా అమావాస్యనాడు దర్శనమిచ్చే నెలవంకను సినీవాలిగా సాంప్రదాయకులు నిర్ధారించారు. 1960 నాటికి ఆరుద్ర పూర్తికాలం సినిమాలకే నిమగ్నమై వున్నాడు కనుక వాలి పదాన్ని హిందీ నుండి తెచ్చుకొని సినీ అనే ఆంగ్ల పదాన్ని కలుపుకుంటే ఆనాటి ఆరుద్ర వృత్తికాంశం తెలియజేస్తుంది. ఈ పదానికి నైఘంటికార్థాలు పార్వతి వగైరాలున్నా అవి ఈ కావ్య సంబంధాలు కావు.**



ఆవంత్స సోమసుందర్

సినీవాలి-1963 ఆగస్టులో ఎమెస్కో వారు గ్రంథంగా ప్రచురించారు. 1/8 క్రౌన్‌లో ఈ కావ్యం పుట ఒకటి నుండి 112 వరకూ మాత్రమే సాగింది. గ్రంథాదిలో కొంగర జగ్గయ్యగారికి అంకిత పద్యాలు. ఆయన స్వీకర్త. కవి కాటూరి వెంకటేశ్వరరావుగారు ప్రచురించిన గద్య పద్యాత్మక పీఠిక స్వవిషయ సూచిక అనే శీర్షికల క్రింద సాహిత్యోపనిషత్తు అనే సాహిత్యపరమైన డైలాగు, ఆరుద్ర వరదగార్ల డైలాగు మొత్తం 23 పేజీలు కేటాయించబడ్డాయి. ప్రస్తుత పరిశీలనాత్మక కావ్యం ఆరుద్ర సినీవాలి అనే కావ్యమే కనుక ముందటి అంశాలు విడిచిపెడుతున్నాను.

నేరుగా కావ్యంలోకే ప్రవేశించడం శ్రేయోదాయకం. త్వమేవాహం తర్వాత ఆరుద్ర రచించిన ప్రయోగాత్మక కావ్యం సినీవాలి మాత్రమే. దీనికి ముందు ఇంటింటి పద్యాలు, గాయాలు, గేయాలు - ఏటికేడాది అనే చందోబద్ధ రచనలూ, సాలభంజిక అనే కవితాత్మక నాటికలు గ్రంథస్థమయ్యాయి. సినీవాలి మాత్రం మధ్యతరగతి క్లేశాల చిత్రణలో సాగిన సంపూర్ణ కావ్యం.

అరుదుగా అమావాస్యనాడు దర్శనమిచ్చే నెలవంకను సినీవాలిగా సాంప్రదాయకులు నిర్ధారించారు. 1960 నాటికి ఆరుద్ర పూర్తికాలం సినిమాలకే నిమగ్నమై వున్నాడు కనుక వాలి పదాన్ని హిందీ నుండి తెచ్చుకొని సినీ అనే ఆంగ్ల పదాన్ని కలుపుకుంటే ఆనాటి ఆరుద్ర వృత్తికాంశం తెలియజేస్తుంది. ఈ పదానికి నైఘంటికార్థాలు పార్వతి వగైరాలున్నా అవి ఈ కావ్య సంబంధాలు కావు.

త్వమేవాహం గురించి మాట్లాడబోయిన కాటూరి యాదృచ్ఛికంగా నాలుక జారగా వెలువడిన పదాన్ని కావ్య నామంగా స్థిరపరచి, కవీశ్వరుని వాక్కును అమోఘమొనర్చాడు ఆరుద్ర.

ఈ కావ్య భాగాలు భారతిలో వెలువడుతున్న సమయంలో 'క్లార్క్ సూర్యారావు' అనే నామకరణమే జరిగింది. ఆ అసలు సత్యాన్ని సైతం మనం జ్ఞాపకం చేసుకోక తప్పదు.

"నేడు అమావాస్య. వేదనా నిలయమైన మనికితో మనం కవితా సమరం సేయ భారతరణం మొదలైన పరమ తిథి సమంజసమగును. నీనాడు మంచిరోజు" అంటూ కావ్యం ప్రారంభమయింది.

సౌరమానం పరిగణించేవారికి అమావాస్య పరమ తిథి కావచ్చుకాని చంద్రమానం పరిగణించే వారికి ఆంధ్రాదులకు అది గొడ్డు అమావాస్యగా దూష్యమే. మన ప్రక్కనున్న తమిళ సోదరులకు అది పవిత్ర తిథే.

మహా భారత సమరం అమావాస్యనాడు ప్రారంభం కావడం వల్లనే పరాజితులందరూ సమరంలోనే స్వర్గస్తులు కాగా, విజేతలు కింకర్తవ్య మూఢులై ఐచ్ఛికంగా స్వర్గారోహణం చేశారు. కనుక యుద్ధ ఫలితం ఉభయ వర్గాలకు దక్కలేదు. సర్వనాశనాన్ని మాత్రం జయేతిహాసం మిగుల్చుకొంది. అలా జరగడానికి అమావాస్యనాడు ప్రారంభం కావడమే కారణమనుకునే ఛాందసులింకా మన మధ్య ఉన్నారు.

కారణమేదైనా ఆరుద్ర సినీవాలి కావ్యానికి రావలసినంత ప్రాముఖ్యత రానేలేదు. విశ్వ విద్యాలయ పరిమితులలో ఎవరైనా పరిశోధన చేశారేమో తెలియదు. కాని ఒక ఆంగ్ల విమర్శకుడు - ఆరోపించినట్లు - యూనివర్సిటీ స్లాటర్ హౌస్‌లో సాహిత్యం సజీవరూపంలో బయటపడటం మాత్రం అరుదే. భారతి ద్వారా ఈ కావ్యం ప్రచురితమైనప్పుడు విమర్శలు గాని, ప్రతి విమర్శలు గాని వచ్చియుండలేదు. ఆ స్థితి ఈ కావ్య ప్రాధాన్యతకు కలిగిన పెద్ద అరిష్టమే.

ఆది మానవుల అరణ్యకవాసం నుండి ఆధునిక నగర నిర్మాణం వరకు సాగిన నాగరికతా సంస్కృతుల పెంపును గురించి సూచనగా ఆరుద్ర -

"తరుల తా గుల్మ బల్మీభరితమైన కారడవిని
శుభ్రమొనరించి కట్టినాడు మానవుడు నగరము"

అంటాడు. కాని అక్కడ కూడా వేదనల లతా గుల్మములు పెరిగిపోతూనే వున్నాయి. "లిప్త లిప్తకూ ఆశలు లుప్తమైన బ్రతుకు నగరాల లక్షణమయింది. మనిషి జాగ్రదావస్థ దుస్వప్నంగా మారుతుంది.

"ఆశయమ్ముల వనమ్ముల చేసికొన్న

వీరునకు పీడకల పాడు పీడ తప్పలేదు"

అంటూ వెరసి మానవుల పీడకలల పీడన నుంచి మినహాయింపులూ కలిగిస్తాయంటాడు. "నిరాశాయుత వాతావరణంలో సైతం ధీరులు విదగ్ధమానులై జీవించే వీలు లేకపోలేదు. వారు ఎగురవేసిన పీడకలల నల్లబావుటా చిరిగిపోయింది. పాత పద్య పాదాలకు అలసట వచ్చి చతికిలబడిపోయాయి." అందుకే మరో పుస్తకంలో మరో పుట తెరుస్తానంటాడు ఆరుద్ర. సామాన్య మానవునికి ప్రేమ ఆసరాగా నిలుస్తుంది.

తనకు తెలిసిన నగరం గురించి గానం చేస్తాడు.

"నగరంలో నాతి గురించి నీతి గురించి రకరకాల సన్నివేశాలలో ఆవేశాల గురించి ప్రకటించుతాను" అంటూ నిత్య వ్యవహారిక శైలికి సమాంతరంగా ఈ కావ్య రచన చేశాడు. త్వమేవాహం కేవలం సంవిధానం కోసం చేసిన అగమ్యపథంగా పేర్కొనబడింది. కాని ఈ కావ్య ప్రసాద గుణ సంవృద్ధితో కావ్యగత విషయానికో, వర్ణనీయ వస్తువుకు ప్రాధాన్యతనిస్తూ సాగింది. ఇందులోను నాటకీయత లేకపోలేదు. భిన్న భిన్న పాత్రలు ప్రవేశిస్తాయి. స్వగతాలు వంటి భాషణలు చేస్తూనే ఉంటాయి. "అనవరతం హోరెత్తే సముద్రం వంటి ప్రజా సమూహం గల నగర" సామూహిక జీవితాన్ని సమిష్టిగా వర్ణిస్తూ కావలసిన కొన్ని పాత్రలపై స్పాట్‌లైట్ ప్రసరిస్తాడు. సన్నిహితమొనరిస్తాడు. మనిషి గురించి కాక మరే విషయంపైనైనా పాడమంటే తనకు నవ్వు వస్తుందంటాడు. కారణం నగరంలో ఉన్నది నకిలీ ప్రకృతి. కల్తీ ఉద్యానవనాలు. "ఈసడింపుగా పాడేరు ఇప్పటి వరకూ కవులు."


ఆరుద్ర

నగరంలో దృశ్యాలు ఆ వ్యక్తులకు సిసలైన సరకు వెల సరసమే. కాని నగరాలు బేరం సాయంత్రం. ఆఫీసులు పని ముగించుకొని, దర్వాజాలు మూసుకొని ఆవలింతలకు ఉపక్రమిస్తాయి. కార్ఖానాలు రగ్గు కప్పుకొని నిద్రించడానికి ఉపక్రమిస్తాయి.

నగరంలో సాయంత్రం హడావుడి పడుతూ ఆపదలు తెచ్చుకొనే యంత్రం సైకిళ్ళ జోరు. మోటారు సైకిళ్ళకు మతి చలించడం... రకరకాల వాహనాలపై ఇళ్ళకు చేరుకున్నా. ఇళ్ళలోనూ ఉద్యోగస్తులకు సుఖసంతోషాలుండవు. "వలపు నోచని మెదళ్ళను, నిండని నోళ్ళను, అలసిన కళ్ళను, వాళ్ళను, వీళ్ళను మెదళ్ళ నోళ్ళ, కళ్ళ కన్నీళ్ళను - కావ్యంగా, శ్రావ్యంగా ఆలపిస్తాను..." అన్నాడు. ఆలపించి ఏం చేస్తాడు కవి? లోలోపలి నిశ్శబ్దాలను వినిపిస్తాడు. దుర్గమ గహనాంతర సీమల్లోకి నడిపిస్తాడు. స్వర్గ నరకాల సహజీవనం చూపిస్తాడు.

కవి చేసిన వాగ్దానంలో ఒక చమత్కారముంది. ఇంతవరకు అనభివ్యక్తంగా నగర జీవన రహస్యాలు మూతపడి ఉన్నాయి. సాహిత్యానికి అవన్నీ అచుంబితాలే! వాళ్ళ దీనగాథలు చిత్రిస్తానని కవి ప్రకటిస్తాడు. పురజనుల జీవితాలకి స్థూల దృష్టికి వేరు, వేరుగా కనిపిస్తాయి. కాని వస్తుమూలంలో తేడాలు లేవు. 'ప్రొద్దుగూకులు బానిసపడి ఇంటికి వచ్చి నిద్రలోకి ఒరిగితే అప్పుడు పీడకలల వేట తప్పదు. నగరంలో ప్రజలు కొండ చరియలలోని చిట్టెడలు కారు." చిట్టెడలు అంటే చిరుత పులులు. ఇది సామాన్యుల పలుకుబడి. పొద్దుగూకులూ కూడా శ్రమ జీవనుల భాష నుండి కవి తెచ్చిన ప్రయోగమే.

కాని నగరం మాత్రం రచ్చకెక్కిన నాపసాని. అంతేకాదు. నగరంలో చిత్రాలు రకరకాలు. "ఎన్నికల ప్రచారంలాగ ఎందుకూ పనికిరాని రాకపోకలు, ఎవరూ నమ్మని వాగ్దానాల వలే. ఎందుకో తెలియని ట్రాఫిక్!" అంటూ ఆరుద్రీకరించిన ఆధునిక నగర జీవితం అస్తవ్యస్తంగా బీభత్స ప్రధానంగా ఉంది. దాన్ని వర్ణించడానికి కొత్త కొత్త పరికరాలు ప్రయోగించాడు.

"నగరం నీకు కాలకూట మకరందం" అంటూ (ఆక్సిమార్న్) అనే ఆంగ్ల అలంకారాన్ని ప్రయుక్తం చేశాడు. దీని అర్థం 'కంజక్షన్ ఆఫ్ సీమింగ్ కాంట్రడిక్టరీస్' అని అర్థం. కాలకూట - మకరందం అలాంటిదే. ఇక్కడ కూటకాలంలో లభించేదని కూడా అర్థం.

నగర నిష్ప్రయోజనత్వం బహుభంగులు. "బలవంతపు పెళ్ళిలోని ముదనష్టపు పెళ్ళికూతురు. మూగవాడి భావప్రకటన. పేడిగాడి మూడో పెళ్ళి ఆడదాని మీసాల్లాగ అసందర్భంగా మొలిచిన ఏటలు. గూనివాడి వీపులాగా అసహ్యంగా పెరిగిన పేటలు." ఇంత అసందర్భపు సొగసులతో నగరం నిన్ను ఉంచుకుంటుంది అనడంలో వ్యంగ్య, సామాజిక వ్యవహారికంలోంచి పుట్టినదే. భరింపరాని దైన్యాన్ని. అపహాస్యం చేసుకుని నవ్వుకుంటే ఒక్క ఓదార్పు. అదీ లేకపోతే బ్రతుకు నిప్పచ్చరమే. ఇన్ని అసందర్భాలున్నా పై పై మోజులతో నగరం ప్రతివాడిని ఆకర్షిస్తుంది. కనుకనే ఆధునిక కాలంలో గ్రామాలను ఖాళీ చేసి ప్రజలు నగరాలకు వలస పోతున్నారు. పల్లెల్లో పిల్ల సమ్మేరీల జరిపే అలాంటి ఇలాంటి మనుషులంతా నగర రాజ్యానికి ఎగబడుతున్నారు. అందుకే నగరం బూర్జువా పెళ్ళికూతురిలా తాత్కాలిక అందాలు చెక్కుకుంటుంది. భూదేవి కోటల వంటి పల్లెలు బీటలు వారిపోతున్నాయి. ఇదంతా నగరం అందించే కాలకూట మకరంద మహత్యమే. ప్రబంధాలలోని అష్టాదశ వర్ణనలలోని నగర వర్ణన ప్రధానమైనదే. ఈ కావ్యం నగర వర్ణనతోనే ప్రారంభం అయింది. కావ్య వస్తువు నగర జీవితమే ఈ అశ్వాశానికి కనిపెట్టిన తొలి పేరు. నగరంలో సూర్యుడు. గ్రంథంగా వెలువడుతున్నపుడు అశ్వాశాల శీర్షికలన్నీ తొలగించాడు. కేవల సంఖ్యా సూచన చేశాడు.

**ప్రబంధాలలోని అష్టాదశ వర్ణనలలోని నగర వర్ణన ప్రధానమైనదే. ఈ కావ్యం నగర వర్ణనతోనే ప్రారంభం అయింది. కావ్య వస్తువు నగర జీవితమే ఈ అశ్వాశానికి కనిపెట్టిన తొలి పేరు. నగరంలో సూర్యుడు. గ్రంథంగా వెలువడుతున్నపుడు అశ్వాశాల శీర్షికలన్నీ తొలగించాడు. కేవల సంఖ్యా సూచన చేశాడు.**

"నగరానికి నీలి నైలాను చీర సొగసులు తారు రోడ్లే. వాటిపై మోటారు కారులే జలతారు బుటా శోభ పానీయపుటంగళ్ళు ఖరీదైన - శాటిన్ లంగా ధరించాలి.

"ప్రాపుల గ్లాసు విండోల లోకట్ జాకెట్ తొడుక్కోవాలి
నైట్ క్లబ్బుల రమ్యమైన న్యూలుక్కు బ్రా బాడీను బిగించాలి
ఆధునిక రంగేళి యువతిలాగ, నగరానికి మెదడు తక్కువ
ప్రాకులెక్కువ. ఆశయాలు లేని ఆశలు విలాసాలూ ఎక్కువ"

ఆ విధంగా నగరం లోపలి భాగాలు చూపీ చూపనట్లు దాస్తూ తెరుస్తుంటుంది. ఆధునిక రంగేళి యువతి అందంలోనే నగరం ఠీవి, దర్పం, ఖాతరు లేని ఉన్మత్తతా వ్యక్తమవుతాయి.




పైకి మర్యాదస్తులుగా బట్టల షాపుల్లో షో గరల్స్‌గానో, ఆఫీసుల్లో టైపిస్టులుగానో పగలు కనిపించే వాళ్ళంతా రాత్రులందు నైట్ క్లబ్బుల్లో కాల్‌గర్ల్స్‌గా బ్రతుకుతుంటారు. ఆధునిక నగర జీవితంలో నారీ స్వేచ్ఛకు ప్రథమ సోపానమదే. ఆడదాని యవ్వనం సాయంత్రపు నీడలా ఎంత చప్పున ఆకర్షిస్తుందో అంత తొందరగానూ అదృశ్యమైపోతుంది. ఆ సత్యం అర్థం చేసుకోకుండా తుళ్ళి తుళ్ళి పడుతున్నారీ కూతుళ్ళు.

ఇండియా కాఫీ హౌస్‌లో మగాళ్ళతో కలసి మెలిసి కూర్చున్న అమ్మాయిలు నాజూకుగా కాఫీలు చప్పరిస్తూ, సిగరెట్లు పీలుస్తుంటారు. నారీ స్వేచ్ఛకదే ఆవిష్కరణ. స్వర్గానికదే తొలిమెట్టు. వాళ్ళకు జీవన ప్రధానమైన సంభాషణలన్నీ హాలీవుడ్, బాలీవుడ్ సినిమా తారల మన్మథ యజ్ఞాల గురించే. టైరోన్ పవర్ అనే అందమైన, అద్భుత నటుడు ఉండేవాడు. ఆ రోజుల్లో అలాంటి వాళ్ళ గురించే ఆ నగరం కలలు కనేది. రంగు రంగుల కలల్లో తేలిపోయేది.

నగరం ఎంచుబడిలో శ్రీమంతులకే ఫస్ట్ ప్రిఫరెన్స్ పేదవాళ్ళు. ఎలా చచ్చినా నగరం పట్టించుకోదు. మేడలపై ఆఖరి అంతస్తు డాబా మీద పూలతోట. డిమ్‌లైట్ల నీలి వెన్నెలలో కృతక జలపాతాలు మెరిసిపోతాయి. అదే స్వర్గమన్న ధీమాతో పన్నెండు గంటల రాత్రిలో పరిష్వంగ నృత్యాలు జోరుగా సాగిపోతుంటాయి. స్లోఫాక్స్ ట్రాట్ సంగీత పారవశ్యంలో నగరం కన్నులు మూసుకొంది. పారవశ్యం పరమపదాన్ని అన్వేషిస్తుంది. పాలపొంగుల స్వర్గం నృత్యం చేస్తున్న నర్తకి తొందరగా తిరుగుతూ ఒత్తి అదుముకున్నట్లు మరుక్షణంలో కంఠాన్ని అదుముకుంటుంది. అది సమానత్వానికి గుర్తు! అంతే తప్ప అందులో అవినీతి లేదు, అనాచారం లేదు. నగరం ప్రదర్శించే పింజారీ బ్రతుకు దృశ్యాలు ఎంత గొప్పవో.

జేబులో డబ్బులుండాలే తప్ప, నగరంలో లభించనివి ఏమీ లేవు. టాక్సీలు తాత్కాలిక వైభవంతో మేట్నీలకు తీసుకుపోవచ్చు. అక్కడ సోడా ఫౌంటెన్‌లో పిచ్ మల్లాయి ఇప్పించవచ్చు. అందమైన భయానక ఆకారాల సినిమా చూపించవచ్చు. 'ఇవన్నీ ధిలాసాగా హోష్‌గా చేయించగలిగినది నగరమే'. ఆ నగరమే నిన్ను ప్రేమిస్తుంది! బొంబాయి కామ్‌గార్ మైదానంలో కార్మికుల మీటింగ్ కన్నా స్టేడియంలో అమెరికన్ స్టయిల్ కుస్తీలు ముఖ్యం. వాటివల్ల ఇహమూ, పరమూ కూడా లభిస్తుంది. జహంగీర్ ఆర్ట్ గ్యాలరీలో చిత్రకళా ప్రదర్శనం కన్నా - లాయడ్స్ గ్రౌండ్‌లో ఫుట్‌బాల్ మ్యాచ్ గొప్ప ఛాన్స్! రసిక జనరంజనిలో సంగీత కచేరీ కన్నా బాక్సింగ్ మ్యాచ్ గొప్ప ఎంటర్‌ట్రెనింగ్.

ఆలిండియా రేడియోలో ఆధునిక సాహిత్యంపై టాక్ కన్నా రేడియో తారాగోష్ఠి గొప్పది! లక్ష్మీపురం వై.ఎం.సి.ఏ.లో ప్రముఖుని ఉపన్యాసం కన్నా క్లబ్‌లో డబ్బుతో రమ్మీ ఆడుకోవడం గొప్ప! ఇలాంటివే నగరంలో సభ్యతలు, పూజ్యతలు. ఇవన్నీ కలసినప్పుడే నాగరికత స్పష్ట రేఖలతో గోచరమవుతుంది.

### సంవిధానంలో మార్పు

నగరంలో పూజనీయ గర్హనీయ విషయాలన్నీ - వివరించి, రచనా సంవిధానం మారుస్తాడు కవి! అభివ్యక్తిలో నవ్యత్వం, నడకలో కొత్త హొయలు ప్రారంభమవుతాయి. కథాక్రమంలోకి ప్రవేశిస్తూ కథానాయకుడ్ని ఇలా పరిచయం చేస్తాడు.

ఇతడొక యువకుడు. కళాశాల నుంచి నిష్క్రమించి కళ్ళు మూసుకొని నగరంలో ప్రవేశించాడు. కడుపుమంటతో కాలిపోతూ కన్నీళ్ళపై స్వారీ చేస్తూ పేవ్‌మెంట్ మీద పడుకోవడానికి పెద్దదైన సంస్కారం చేతపట్టుకొని, స్వగతంగా సతమతమవుతున్నాడు."

అంటూ ఆరుద్ర తన కావ్య నాయకుని నగర ప్రవేశం చిత్రించాడు. అతడు కడుపు చేత పట్టుకొని, డిగ్రీని ధరించేడు. ఉద్యోగార్థిగా నగరాన్వేషణను ఉపక్రమించాడు. మధ్యతరగతి సంస్కారం బిచ్చగాళ్ళతో సమానంగా పేవ్‌మెంట్ల మీద పడుకోనివ్వదు. హోటల్‌లో గది తీసుకుందుకు త్రాణ లేదు... పై మెట్టుకు ఎక్కలేదు. క్రింది మెట్టుకు జారుకోలేదు. అందుకే సతమతమవుతున్నాడన్నాడు. ఆరుద్ర, సాధారణ వ్యవహారికంలో జనబాహుళ్యం సతమత అనే ప్రయోగిస్తారు. కానీ ఈ పదబంధపు అర్థ స్వరూపం "సదమదమనడమే".

దుష్ట ప్రయోగాలు, పదుగురాడటంతో రూఢిగా మారి, చెల్లుబాటు కలిగిస్తున్నాయి.

**బొంబాయి కామ్‌గార్ మైదానంలో కార్మికుల మీటింగ్ కన్నా స్టేడియంలో అమెరికన్ స్టయిల్ కుస్తీలు ముఖ్యం. వాటివల్ల ఇహమూ, పరమూ కూడా లభిస్తుంది. జహంగీర్ ఆర్ట్ గ్యాలరీలో చిత్రకళా ప్రదర్శనం కన్నా - లాయడ్స్ గ్రౌండ్‌లో ఫుట్‌బాల్ మ్యాచ్ గొప్ప ఛాన్స్! రసిక జనరంజనిలో సంగీత కచేరీ కన్నా బాక్సింగ్ మ్యాచ్ గొప్ప ఎంటర్‌ట్రైనింగ్.**

"మదనకరంబున సదమదములగు"

అంటూ వసు చరిత్ర ప్రయోగం కన్న శిరోధార్యం వేరొకటి ఉండదు కదా! సదమదము చేయు అనే పదానికి చంపడం సలపడం అనేవి ప్రముఖార్థాలు! ఇక్కడ ఆరుద్ర ప్రయోగాన్ని మహాకవి ప్రయోగంగా ఆమోదించి, నిఘంటువుల్లో చేర్చుకోవచ్చు! జౌగాములు తెలియక, కర్తవ్యం తోచక మనో సంకటపడటం అని అర్థం వస్తుంది.

కావ్య నాయకుని మానసిక సంక్షోభాన్ని వ్యక్తం చేస్తూ రెండవ కవితలో - నగర జీవిత బీభత్సాన్ని ఇలా వర్ణిస్తాడు.

ఘోరాటవి ఈ నగరం
పోరాడే శక్తి లేదు, పోలేను ఎట
వేరెవరూ నా అంటూ
కూరిమి బంధువుల పసిడి గొలుసులు తెగినై ...

అవును నిర్ధనులకూ, నిర్భాగ్యులకూ నగర జీవనం ఘోరాటవి వంటిదే! నిస్సహాయులకు దాన్ని అతిక్రమించే శక్తి ఉండదు. మన కథానాయకుడు సూర్యుడికి అసలే శక్తి లేదు. పోనీ ఎటైనా పోగలడా! అంటే అదీ లేదు. నగరంలో ఒక్క చిరునవ్వుతో పలకరించే ప్రేమపాత్రులు లేరు. కూరిమి గల బంధువులూ లేరు. బంధుత్వాలన్నీ బంగరు గొలుసులకే బంధితాలు! ఇప్పుడు ఆ గొలుసులు తెగిపోయాయి. గనుక అతగాడు కలల పచ్చడం నేసుకుంటున్నాడు. రానున్నది చలికాలం కదా! అంతకన్నా తనేం చేస్తాడు! ఎక్కడ పడితే అక్కడల్లా మహా పాతకాలే ఎదురవుతున్నాయి! వాటి అంతరార్థాలు తెలుసుకుంటున్నారు. దానివల్ల ఏం లాభం? పాతకాలం ఆపలేదు. కనుకనే ఆ సంగతే స్వగతంగా అనుకుంటున్నాడు. పెదవులు దాటితే ప్రమాదం కదా! పైగా ఉల్లేఖించిన కంద పద్యం, ఎంత మృదువుగా, ఎంత సాఫీగా, సాధారణ సంభాషణకు ఎంత సమాంతరంగా సాగిందో ఛందశ్శుందా మార్కుడు గ్రహిస్తే ఎంత సంతోషమో!

ఆ అన్వేషకుడికి ఎదురుపడి వస్తున్నది కలలోపలి పచ్చదనమే! పెద్ద కార్మణ్య దీక్షతో పొద్దు పుచ్చుతున్నాడు. తనలాగే అందరూ శ్రమ వ్యర్థులే పాతకాలే చేస్తున్నారు. అవే చూస్తున్నాడు. వాటికర్థం ఏమిటో తెలియదు. అయినా మనస్సు ఆలోచించడం మానదు.

అంతరంగం కల్లోలభరితమైనది. ఇక్కడ దొరికినది ఏదో చక్కదనం అనిపించవనిపించినది. అవి అందకుండా ఎక్కడకో పోతాయని లోపలి భయం. ఈ మథనంలో చైతన్యం రెక్కవిప్పుకుంది. అది కనిపించని చక్కదనం. అది తను పిలిచిన క్షణమే తనువంతా పులకరించింది. 'పెనుతాపం ఒడలంతా ఆక్రమించినది.'

"కొడిగట్టిన మదిలోపల నడియాడును కైవల్యం"

నిశ్చలత్వము, చైతన్యభరితము కావలసిన మనస్సు మరణానంతర కైవల్యం కోసం అంగలు చాస్తుంది. అది ఒక కడలిలాగ కల్లోలితం అవుతుంది. కాని జీవ చైతన్యం లేనిదల్లా బుద్ధి వైఫల్యమే. కనుకొలకల నుండి కరిగి నునువెచ్చని నైరాశ్యం - మనస్సును హత్తుకుంటుంది. ఎవరో పెద్దలు చెప్పిన పనికిరాని సూక్తులే తిరిగి కళ్ళకు కనబడుతున్నాయి. అవి గడ్డకడుతున్నాయి. మొండిచేయి, కనుల దొలుస్తుంది. గుడ్డులోని గునపంలాగ సర్వనాశనం చేయబూను కొంటుంది. దానికి సత్ఫలితాలు ఏనాటికీ లభించవు. తన చుట్టూ నడయాడుతున్న కోరికలు ఎండమావులే! బండరాయికి కన్నులు లేవు! చెదపట్టిన మన హృదయం నడవలేదు. ఆకాశ లోకాలకు ఎగురుదామన్న ప్రయత్నం ఫలించలేదు. అతని అప్పులున్నూ, డిస్ట్రిబ్యూట్ చీకట్లచే సూర్యుడిని... తినేస్తున్నాయి. ఆ చీకట్లు దేశ దిమ్మరులై చైతన్యం లేదు. కాని, అవి సూర్యునికి ఉపమానాలే - అనగా కవి అనామకంగా, నిర్యాపారంగా, అలుముకుంటున్న చివాట్లు కూడా సూర్య సంతానములే! ఆ తదుపరి కవి కథనంలోకి వస్తాడు.

"ఆర్జించుకొన్నట్టి ఆవేదనాగ్ని బూర్జువా సరదాల బుజు ధరించ తనలోని తానుగానున్న తపించు వనిత మన కథానాయకుడు. అతని చుట్టూ గల పరిసరం అంతా గుడి సుళ్ళు పడుతుంది. కథానాయకుడే స్వగతంలో ఇలా అనుకుంటున్నాడు. ఎవరైనా నాకు తియ్యని విషమిస్తే బాగుండును. బాగుండును. "నా వేదన దగ్ధం చేసి నన్ను సమ్మను చేసి ఆకృతి నా కాళ్ళకి చక్రాలు, నా కళ్ళకి సర్గాలు, నా కలలకు రెక్కలిచ్చి, ఇంకో లోకంలోకి మరో తీరానికి నన్ను ఎగరేసుకుపోతే బాగుండును" మనస్సు దైన్యంలో నిండిపోతున్నా ఆశలకు మాత్రం అంతులేదు. ఇంత నైరాశ్యపు ఊబిలో చిక్కుకున్న తాను ఉద్ధరించగల శక్తి ఏదైనా ఎదురైతే బాగుండును. తన కోరికలు తీర్చగల దివ్యశక్తి ఏది ఆలోచనలు సాగే రీతిగా ఏనాతి ఎదురు కాదు. హృదయ నేత్రాలు విచ్చుకొని మరొకసారి, మరొకసారి ఆలోచిస్తూనే ఉన్నాడు!!

వదులుగా వున్న పొదిగిలిలోంచి బిగించి, కఠినమైన పిడికిలిలోంచి మొద్దుబారిన కత్తుల బాటి నుంచి, పదును పట్టిన మార్గాంతరం నుంచి, కోరికలూ, ఆశలూ కుమ్ములాడుకుంటున్న పరిస్థితిలో వేషాల మార్గం నుంచి నిస్సారమైన జీవితం నుంచి సారవంతమైన కష్టంలోకి మళ్ళించగల మొనగాడెవరు? అలాంటి మొనగాడెవరైనా తారసపడితే కష్టాల సుఖాలకు - అతీతమైన శుభ్ర పవన పరిమళంలో తాను సేదతీరేవాడు. తన కోరిక తీర్చగలవాడెవడూ కనిపించడం లేదు.

నా కళ్ళకు, స్వర్గాలకూ, నా కలలకూ రెక్కలిచ్చే ఇంకో లోకంలోకి మరో తీరానికి, నన్ను ఎగరేసుకుపోతే బాగుండు అనుకుంటూ ఈ రీతి ఆనాటి ఎదలోన కుములు చేరి ఏరొకనాలి చింతించసాగెను. "వదులుగా నున్న పొదిగిలిలోంచి ద్వేషాలు మార్గము నుంచి కడకు నిస్సారమైన జీవితం నుంచి సారవంతమైన కష్టలోకానికి మళ్ళించగల మొనగాడెవరు? మనస్సు చెల్లించగల వాడెవరు? అట్టి మొనగాడు తారసిల్లలేదు.

**(సశేషం)**

# కన్యాశుల్కం ఆంగ్లానువాదంలో అపచార పరంపర

- రామతీర్థ




**'కన్యాశుల్కం' ఆంగ్లానువాదం అంతర్జాతీయ ప్రతిగా, వెల్చేరు నారాయణరావు అనువాదంతో 2011లో పెంగ్విన్ బుక్స్ ఇండియా వారు ప్రచురించారు. ఇది తెలుగు సాహిత్య లోకానికి ప్రతిష్టను ఇనుమడింపచేసే సందర్భం. 'కన్యాశుల్కం' నాటకం ఏ విధంగా చూసినా తెలుగు వారి ఆధునిక సాహిత్య చరిత్రకు ఆరంభ సింధువు. ఆనాటి తెలుగు సమాజం ఎలా వుందో తెలియజెప్పే సాంస్కృతిక దర్పణం. దీన్ని ఆంగ్లంలోకి తీసుకువెళ్ళే బాధ్యతను ఎంతో సమన్వయ ఐక్యతతో నిర్వహించాల్సిన అవసరం వుంది. కానీ అటువంటి దక్షత ఈ పుస్తకంలో కన్పించదు.**

సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు కడియాల రామమోహన రాయ్ 2009లో 'కన్యాశుల్కం' రెండవ కూర్పు, మరియు శ్రీశ్రీ శత జయంతి వత్సర ఆరంభ సభలు విశాఖపట్నంలో నాలుగు రోజుల పాటు ఘనంగా జరిగిన సందర్భంలో.. తన ప్రసంగంలో... తెలుగు సాహిత్యంలో తొలి వెయ్యేళ్ళలో ఎన్నదగిన రచన, మహాభారతం ఒక్కటేననీ, మనం రెండో సహస్రంలో రెండు గొప్ప రచనలను పొందగలిగిన అదృష్టవంతులమనీ చెప్తూ, ఆ రెండు గొప్ప రచనలు ఒకటి 'కన్యాశుల్కం' నాటకం, రెండోది 'మహాప్రస్థానం' కావ్యం అని తన పరిశీలనను తెలిపారు.

'కన్యాశుల్కం' ఆంగ్లానువాదం అంతర్జాతీయ ప్రతిగా, వెల్చేరు నారాయణరావు అనువాదంతో 2011లో పెంగ్విన్ బుక్స్ ఇండియా వారు ప్రచురించారు. ఇది తెలుగు సాహిత్య లోకానికి ప్రతిష్టను ఇనుమడింపచేసే సందర్భం. 'కన్యాశుల్కం' నాటకం ఏ విధంగా చూసినా తెలుగు వారి ఆధునిక సాహిత్య చరిత్రకు ఆరంభ సింధువు. ఆనాటి తెలుగు సమాజం ఎలా వుందో తెలియజెప్పే సాంస్కృతిక దర్పణం. దీన్ని ఆంగ్లంలోకి తీసుకువెళ్ళే బాధ్యతను ఎంతో సమన్వయ ఐక్యతతో నిర్వహించాల్సిన అవసరం వుంది. కానీ అటువంటి దక్షత ఈ పుస్తకంలో కన్పించదు.

'కన్యాశుల్కం' తెలుగువారికి ఎంత చిరపరిచితమయినా ఒక ఆంగ్ల రూపాన్ని తెలుగు వారి జీవితం, సాహిత్యం తొలిసారి చదువుకునే తెలుగేతర పాఠకలోకం కోసం ఒక సమగ్ర అనువాదం, అందజేసేందుకే పరిశ్రమ జరగాల్సి వుంటుంది. కానీ వెల్చేరు నారాయణరావు "అభావ చేష్టలు" ఈ మొత్తం ప్రణాళికను నీరుగార్పించి పక్కదారి పట్టించాయి. కన్యాశుల్కం నాలుగో అంకం ఆరంభంలో రామప్ప పంతులు వేళగానివేళ పట్టపగలే మధురవాణిని ముద్దుపెట్టుకుంటుండగా రంగప్రవేశం చేసే లుబ్ధావధాన్లు పలికే తొలి డైలాగు ఇది. "యేమిటీ అభావ చేష్టలూ!" అని? వెల్చేరు నారాయణరావు చేసింది అంతకు మించిది లేదు అని ఈ ఆంగ్లానువాద పుస్తకాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. సనాతన ఆచారాలు సంపన్నంగా గల ఆఫ్రికన్ సమాజం లోనూ ఏదో ఒక రూపంలో 'కన్యాశుల్కం' పద్ధతి వుంది. దీన్ని ఆఫ్రికన్ రచయితలందరూ ఆంగ్లంలో రాసేటపుడు "బ్రైడ్ ప్రైస్" అనే వ్యవహరిస్తారు. ఇది పెళ్ళికి సంబంధించిన ఆచారమని, ఈ పారిభాషిక పదమే తెలుపుతుంది. ఇంకా ఇదే సమస్యను మనకి పొరుగు భాషైన ఒరియాతో 'మాధామహంతికొకన్యా సుద్నా" పేరిట ఒరియా సాహిత్యపు ఆధునిక యుగకర్త గురజాడకి సమకాలికుడు అయిన ఫకీర్ మోహన్ సేనాపతి రాసిన కథను నేటి తరం ఒరియా రచయితలు ఆంగ్లానువాదం చేసినపుడూ దానికి పేరు "బ్రైడ్ ప్రైస్" అని పెట్టారు. అలా ఒక అర్థాన్నిచ్చేదిగా నలుగురికీ తెల్సిన పదాన్ని రచయితలు, అనువాదకులు ఉపయోగించడం ద్వారా అర్థానికి సంబంధించిన గందరగోళం ఏర్పడదు. కానీ వెల్చేరు నారాయణరావు ఆంగ్లంలో నాటకం పేరును "అమ్మకానికి అమ్మాయిలు" అని అర్థం వచ్చేలా "గర్ల్స్ ఫర్ సేల్" అని మార్చారు. జరిగేదానికి వీరు పెట్టిన పేరుకు మధ్య ఎంతో తేడా వుండడమే కాక, బ్రైడ్ ప్రైస్ అనేది ఒక పాతకాలపు మూఢాచారమని, దాన్ని గురజాడ ఎదుర్కొంటూ ఈ నాటక రచన చేశారనే వివరణ. ఇదేమీ తెలుగేతర పాఠకలోకానికి అందే అవకాశం లేదు.

తన ఆంగ్లానువాదం, మూల ప్రతి యొక్క పద్ధతులకు, విషయ క్రమానికీ అనుగుణంగా లేదు. 'కన్యాశుల్కం' నాటకం అంటే 'కేవలం పాత్రలతో మొదలై సరాసరి నాటకంగా' పరిచయం చేయడానికి ఇదేమీ పది రచనల తర్వాతొచ్చిన పదకొండో రచన కాదు. తెలుగు వారి ఆధునిక సాహిత్య యుగపు ఆది రచన. ఈ నాటకం పీఠికలు, అంకితాలు, పత్రికలలో వచ్చిన వార్తలు, వగైరాలన్నీ తెలుగు మూలంలో ఎలా వున్నాయో, అలానే తెలుగేతర పాఠకులకూ తెలియచేయాల్సిన కర్తవ్యం అనువాదకుడి మీద వుండగా, దీన్ని ఎంతమాత్రమూ వెల్చేరు నారాయణరావు పాటించలేదు.

**గురజాడ, ఆనందగజపతి కిచ్చిన అంకిత పత్రాన్ని గురజాడ రాసిన రెండు పీఠికలను తొలగించారు. ఆ మేరకు కన్యాశుల్కం వెలువడ్డ చారిత్రక సందర్భం ఎటువంటిదో స్వయానా మూల రచయిత చెప్పినదాన్ని అంతర్జాతీయ పాఠక లోకానికి అందకుండా చేశారు. మన సాహిత్య, సాంస్కృతిక చరిత్ర క్రమాన్ని అంతర్జాతీయ పాఠక లోకానికి సరైన పద్ధతిలో తెలపడం అనేది పరమ ప్రమాణంగా ఎంచే తెలుగు వారందరూ, ఇదెంతటి చారిత్రక తప్పిదమో, ఎంతటి బాధ్యతారాహిత్యమో గ్రహిస్తారు.**

తన ఆంగ్లానువాదాన్ని ఎవరికి అంకితమిచ్చారో (రమేష్, శ్రీలత వేమూరి మాటల కందని స్నేహితులకు) అది ప్రస్ఫుటంగా వుంది కానీ గురజాడ చేసిన అంకితాన్ని తొలగించారు. ఆనంద గజపతి పేరిట అంకితమిస్తూ గురజాడ స్వయానా 1897లో ఆంగ్లంలో రాసిన అంకిత పత్రం, ఒక చారిత్రక డాక్యుమెంట్. అంతేకాక తాను తెలుగులో రాసిన 'కన్యాశుల్కం' నాటకానికి మొదటిసారి 1897లోనూ, రెండోసారి 1909లోనూ గురజాడ ఆంగ్లంలోనే పీఠికలు రాశారు. ఇది ఆంగ్లంలో వుండటం వల్ల అనువాదకుడి పని మరింత సులభమవుతుంది. అంతేకాక తెలుగేతర పాఠకులకు ఆ రోజుల్లో గురజాడ ఎటువంటి ఇంగ్లీష్ రాశారో సాధికారికంగా తెలుస్తుంది. అయినా ఇన్ని ప్రయోజనాలనూ, మూల రచన పట్ల విధేయతనూ కాదని వెల్చేరు నారాయణరావు, గురజాడ, ఆనందగజపతి కిచ్చిన అంకిత పత్రాన్ని గురజాడ రాసిన రెండు పీఠికలను తొలగించారు. ఆ మేరకు కన్యాశుల్కం వెలువడ్డ చారిత్రక సందర్భం ఎటువంటిదో స్వయానా మూల రచయిత చెప్పినదాన్ని అంతర్జాతీయ పాఠక లోకానికి అందకుండా చేశారు. మన సాహిత్య, సాంస్కృతిక చరిత్ర క్రమాన్ని అంతర్జాతీయ పాఠక లోకానికి సరైన పద్ధతిలో తెలపడం అనేది పరమ ప్రమాణంగా ఎంచే తెలుగు వారందరూ, ఇదెంతటి చారిత్రక తప్పిదమో, ఎంతటి బాధ్యతారాహిత్యమో గ్రహిస్తారు. ఏ చారిత్రక స్పృహ లేకుండా ఈ నాటకాన్ని తనకు నచ్చిన రీతిని అందించే స్వేచ్ఛ, అధికారం వెల్చేరు నారాయణరావుకు లేవు. కానీ జరిగింది ఇదే.

1909లో గురజాడ కన్యాశుల్కం రెండవ ప్రతి ముద్రణ జరిగిపోయి అందుబాటులో వుంది. 1910లో గురజాడ రాసిన 'దేశభక్తి' గీతం 1913లో కానీ అచ్చు కాలేదు (కృష్ణా పత్రిక). ఈ ఆంగ్లానువాదం తొలి పేజీలలో 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్నది ఆంగ్లంలో పొందుపరిచారు ఏ వివరణా లేకుండా. దీనివల్ల ఈ నాటకానికి సంబంధించిన గురజాడ వ్యాఖ్యగా, మన సాహిత్య సమాచారం ఎంతమాత్రం తెలీని తెలుగేతర పాఠకులు భావించే అవకాశం వుంది. ఇది ఇలా అనవసర గందరగోళానికి దారి తీయకుండా "గురజాడ తర్వాత కాలంలో రాసిన ప్రఖ్యాత గేయం నుంచి తొలి పంక్తుల్ని" ఇక్కడ పొందుపరిచామనైనా అనువాదకులు చెప్పి వుండాలి. ఏ ప్రస్తావనా లేకుండా కేవలం ఆ పంక్తి నొక్కదాన్ని ఆంగ్లంలో ఉటంకించి ఉరుకుంటే, అసలు గురజాడ "దేశభక్తి" అనే గీతం రాసారనే సమాచారమే అంతర్జాతీయ పాఠక లోకానికి అందదు. అయినా 1909లోనే పూర్తయిపోయిన ఓ పుస్తకంలో, ఏ వ్యాఖ్యాన వివరణా లేకుండా 1910 తర్వాతి గీతం నుంచి ఒక పంక్తి జోడించడం, ఏ చారిత్రక దృష్టినీ గౌరవించినట్టు కాదు. ఇది ఎందుకు చేశారో సమాధానమివ్వాల్సిన బాధ్యత వెల్చేరు నారాయణరావుదే.

ఇక గురజాడ రాసిన 120 ఏళ్ళకు 'కన్యాశుల్కం' అంతర్జాతీయ ప్రచురణ దేశ దేశాల పాఠకులకు అందుబాటులోకి ఎంతో బాధ్యతను పాటిస్తూ తీసుకు వెళ్ళాల్సిన ఈ అనువాదకుడు, గురజాడ అంకిత పత్రం, ముందు మాటలు తీసివేసి, తన ముందు మాటను చేర్చడం, దానిలో 'కన్యాశుల్కం' నాటకపు ఆవిర్భావ నేపథ్యం గురించి పెద్దగా ఏమీ ప్రస్తావించకపోవడం, అభ్యంతరకరాలు. అనువాదకుల మాటగా కొంత వివరణను, మూలంలో వున్నవన్నీ యధాతథంగా చేర్చాక, తామూ పొందుపర్చవచ్చుగానీ, వాటిని తీసేసి మాత్రం కాదు. దీనిలో వెల్చేరు నారాయణరావు "అభావ చేష్టలన్నీ" మొదలవుతాయి. ఈ కన్యాశుల్కం నాటకాన్ని ముందు భాగాలు తొలగించి, తన పద్ధతిలో "ది ప్లాట్", "ది ఆదర్", "ది టెక్స్ట్" అంటూ మూడు లఘు పరిచయాంశాలతో తన ఇంట్రడక్షన్ ముగించారు. ఇందులో వీరు చెప్పినది సాధించడం కోసం 'కన్యాశుల్కాన్ని' ఉపయోగించుకోవాలన్నది వీరి ఆలోచన. ఇంతకీ ఏమిటి వెల్చేరు మార్కు ఆలోచన "ఇంట్రడక్షన్"లోనే "ది ఆథర్" అన్న పరిచయ భాగంలోఇలా రాశారు వెల్చేరు నారాయణరావు (ఆంగ్లానికి తెలుగు రూపం ఇది).

"విమర్శకులు ఎవరయితే ఈ నాటకం గురించి తెలుగులో రాస్తూ వచ్చారో వారు చెప్పేదాని ప్రకారం ఈ నాటకం అనేక సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా సమాజ సంస్కరణలకు చేదోడుగా వుండేందుకు రాయబడింది. పసిపాపలను బాల వధువులుగా అమ్ముకోవడం, వితంతు పునర్వివాహాన్ని వ్యతిరేకించడం, మరియు భోగం వాళ్ళను పెంచి పోషించే సమాజపు అలవాట్లకు వ్యతిరేకంగానూ రాయబడిందంటూ, అప్పారావును ఆయన బెంగాలీ సమాజంలోని నూతన ఆలోచనలు, సంఘ సంస్కర్తల అడుగుజాడల్లో తెలుగులో సైతం సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని తీసుకొచ్చిన వైతాళికుడుగా తెలుపుతున్నారు. నేను ఈ దృక్కోణాన్ని (దృష్టిని) వ్యతిరేకిస్తున్నాను, దీన్ని విపులంగా నేను ఈ నాటకానికి నా వెనుక మాటలో చర్చిస్తాను. నాటకం గురించిన లోతైన విశ్లేషణతో పాటు ఏ సాంస్కృతిక సందర్భంలో ఈ నాటకం రాయబడిందీ సైతం వివరిస్తాను (పేజీలో ఇంట్రడక్షన్ 17 - మూడో పేరా).

ఈ 'వెనుక మాట'ను ప్రత్యేకంగా చదివి, ఇందులో వెల్చేరు నారాయణరావు చెప్పిన అనేక విషయాలను సాహిత్య, సాంస్కృతిక ప్రయోజనాలకై అకడమిక్‌గా విపులంగా విభేదించాల్సిన అవసరం వుందని, 2000లోనే విజయనగరానికి చెందిన సాహిత్యవేత్త డా॥ ఎ.యు. నర్సింహమూర్తి, "కన్యాశుల్కం" రెండవ కూర్పు శత వత్సర సభలో సూచించినప్పటికీ, ఈ పరిశీలన ఇంతవరకూ జరగలేదు. ఈ అయిదేళ్ళుగా అంటే (2007లో ఇండియానా యూనివర్శిటీ ప్రెస్సు వారు, వెల్చేరు నారాయణరావు చేసిన 'కన్యాశుల్కం' ఆంగ్లానువాదం ప్రచురించినప్పట్నుంచీ) వీరు చేస్తున్న వాదనల మూలాలన్నీ ఈ 'వెనుకమాట'లోనే వున్నాయి. దీన్ని సమగ్రంగా, నిశితంగా, నిర్మాణాత్మకంగా నిర్దిష్టంగా విభేదించాల్సిన అవసరం వుంది.

వంగ దేశాన్ని, బెంగాల్ మేధావులను ప్రభావితం చేసిన యూరోపియన్ పాశ్చాత్య ఆలోచనల కన్నా, మౌలికంగా విభిన్నమైనదేదో విజయనగరంలో సంభవించిందని చెప్పే వెల్చేరు నారాయణరావు ఉబలాటం, తన "ఇంట్రడక్షన్"లోనే కన్పిస్తుంది. దీన్లోనే బెంగాల్ అభ్యుదయవాదులైన రాజా రామమోహన్‌రాయ్, కేశవచంద్రసేన్, బకించంద్రం ఛటర్జీ, రవీంద్రనాథ్ ఠాగూర్ వంటి వారిని నవయుగ

వైతాళికులుగా పేర్కొంటూ వారి సంస్కరణాభిలాష, కొత్త సమాజం గురించిన ఆలోచనలు భారతదేశంలో ఇతర భాషల వారికీ వ్యాపించాయని చెప్పే చరిత్ర పద్ధతి సరికాదనీ, తెలుగువాడయిన అప్పారావు గారి రచనలతో యూరోపియన్ పండితులకు పరిచయం ఏర్పడి వుంటే, ముఖ్యంగా "కన్యాశుల్కం" నాటకంతో వారికి పరిచయ ముండి వుంటే, భారతీయ ఆధునికత యొక్క కథే వేరుగా వుండేదని తన ఇంట్రడక్షన్ మొదటి పేరాలోనే వెల్చేరు నారాయణరావు చెప్తున్నారు. దీన్నే వీరి వెనుక మాటలో నలభై అయిదు పేజీలకు విస్తరించి రాశారు.

విడదీసి, గొప్పవారిని చేసే ఒక "డివైడ్ అండ్ గ్లోరిఫై" విధానం వెల్చేరు నారాయణరావు ఎంచుకుని, బెంగాల్ రచయితలు, సంఘ సంస్కరణశీలురు వీరందరికన్నా విభిన్నమైనదిగా గురజాడ ఆధునికతను పెద్ద చేసే ప్రయత్నం చేశారు. ఇది అసాధ్యమైన వ్యాయామం. "ఒకడుగు ముందు, రెండడుగులు వెనుకకు" అన్న ఒక వామపక్ష మహా మహోపాధ్యాయుడి మాటలు గుర్తుకు రాక మానవు. తాను అనుకున్న మూసలోకి, సాహిత్య సామాజిక సమాచారాన్ని మలిచే ప్రయత్నంలో వెల్చేరు నారాయణరావు పడే అవస్థ చూస్తుంటే ఎంత అసంబద్ధమైన "ఇంట్రడక్షన్" అంటే పాశ్చాత్య చింతన, నమూనాలతో సంబంధం లేని, తనదైన ఆధునికతను కలిగున్నవాడిగా గురజాడను పెద్దగా చూపిస్తూనే అదే ఇంట్రడక్షన్ మరో పేజీలో గురజాడ ఏ సంఘ సంస్కరణలకూ చెందినవాడు కాదనీ, రియలిస్టు అంటూ, బోలువాదం ముందుకు తెచ్చి, గురజాడ రచనలకు గల ప్రయోజనాన్నీ, జనహితాన్నీ, పూర్వపక్షం చేసి, "అబ్బెబ్బే! గురజాడ అందుకోసం రాయలేదు" అని మసిపూసి మారేడుకాయ చేసే ప్రయత్నాలు, వెల్చేరు నారాయణరావు ముందుమాటతో విత్తనప్రాయంగా, వెనుకమాటలో విస్తార ప్రతిపాదనలుగా వున్నాయి. ఇప్పుడు మనకి జవాబు లభిస్తుంది? ఎందుకు వెల్చేరు నారాయణరావు గురజాడ రాసిన ఆంగ్ల పీఠికలను ఈ ఆంగ్లానువాదం నుంచి తొలగించారో? సంఘ సంస్కరణ, తెలుగు లేదా కళింగ సమాజంలో, వంగ సమాజంలో వున్న ఈ కన్యాశుల్క సమస్యపై కొంత అవగాహన కలిగేందుకే తాను రాశానని, గురజాడ స్పష్టంగా చెప్పిన వాక్యాలు గల పీఠికలు, వెల్చేరు నారాయణరావు తన ముందుమాట వెనుక మాటల్లో ఏ వాదనలు ముందుకు తీసుకువద్దామనుకుంటున్నారో, అందుకు గురజాడ పీఠికలు ఆటంకాలవుతాయి. అందుకే వాటిని తొలగించేసి, నాటకాన్ని ఆ మేరకు అసమగ్రపరచి, తన ముందుమాట, వెనుక మాటలతో ఈ ఆంగ్ల కన్యాశుల్కం ద్వారా, నూటా ఇరవై ఏళ్ళుగా తెలుగువారి సాహిత్య, సాంస్కృతిక ప్రగతి యాత్రకు ఎత్తిన పతాకయిన 'కన్యాశుల్కం' నాటక శక్తినీ, ప్రయోజనాన్ని సమాజ హితం నుంచి దూరం చేయడమే లక్ష్యంగా, ఇలా తనకు అనుకూలించే రూపంలో 'కన్యాశుల్కం' ఆంగ్లరూపం వెల్చేరు తీసుకువచ్చారు.

భారతదేశంలోనే తూర్పు భాగమైన తెలుగు ప్రాంతం, కళింగ ప్రాంతం వంగ దేశం ఎల్లెడలా పసిపిల్లలను బాల వధువులుగా అమ్ముకోడమనే దురాచారం వుంది. వంగదేశపు సమాజంలో గల ఒక నానుడి ఈ విషయాన్ని తెలియజేస్తుంది. "కన్యేర్ మా కాంథే, టాకోర్ పుట్లీ బాంథే" అంటే "కన్య తల్లి ఏడుస్తుంది సరే, రొంటిలో డబ్బు మూట దాస్తుంది" అని తెలుగులో అర్థం చెప్పుకోవచ్చు. ఫకీర్ మోహన్ సేనాపతి కథ ద్వారా ఒడియా దేశ సీమల్లో సైతం ఎలా ఈ దురాచారం వుండేదో పాఠకులకు అవగాహన కలుగుతుంది. ఇలా 'కన్యాశుల్కం' సమస్యను తూర్పు భారతదేశంలో పలు భాషల, ప్రాంతాల ప్రజలకు చెందిన సరిదిద్దబడాల్సిన దురాచారంగా భావించి, అందుకు తగు మంచి విశ్లేషణ అందించి, ప్రపంచ నాటక రంగంలో నూటా ఇరవై ఏళ్ళ క్రితం రాయబడ్డ నాటకాలతో సరిపోల్చి ఒక విశాల విస్తార విశ్లేషణ రాసేందుకు ఎంతో శక్తి కావాలి. అటువంటి శక్తి, సహనం, బహుళ సంస్కృతుల సమాజాన్ని అర్థం చేసుకోవడంలో ఉదార దృష్టి, ఇటువంటివి లోపించిన వారు, ఈ విధంగానే 'కన్యాశుల్కం' నాటకం పట్ల ఎన్నో అపచారాలు చేసినవారుగా మిగిలిపోతారు.

ప్రపంచ నాటకాల మాట అటుంచి, కనీసం భారతీయ భాషల్లో వచ్చిన నాటకాల నేపథ్యమూ తెలుసుకోకుండానే ఈ 'కన్యాశుల్కం' అంతర్జాతీయ ప్రతిలో ముందుమాటలు, వెనుక మాటలు రాశారు వెల్చేరు నారాయణరావు. 'వెనుకమాట'లో ఏమున్నదీ, ఎందుకు విభేదిస్తున్నామన్నది వేరే విస్తృత రచనగానే రాయాలి తప్ప అరకొర ప్రస్తావనలు చేయలేము. అయినా ముందుమాటలో కన్యాశుల్కం "ఏ భారతీయ భాషలోనయినా ఆంగ్లేయ వలసవాద పరిపాలన వల్ల సమాజంపై కలిగిన ప్రభావాలను లోతుగా దర్శించిన తొలి నవల" అని రాసేశారు. ఇది సరికాదు. అటువంటి ఒక నాటకం, విభిన్న ఇతివృత్తంతో అప్పటికే బెంగాలీ సాహిత్యంలో ముందే వచ్చింది. దానిపేరు "నీల్ దర్పణ్" రచయిత దీన బంధుమిత్ర. నాటక రచనా కాలం 1858-1859. ఆంగ్లానువాదం జరిగింది 1861లో. చేసింది మైకేల్ మధుసూదనదత్తు. వెల్చేరు నారాయణరావుకి ఇవేమీ తెల్సినట్టు లేదు.

తానూ ఆంగ్లంలో ఒక వ్యాఖ్యానాన్ని 'వెనుక మాట'గా పొందుపరచి అందులో తన అడ్డగోలు అభిప్రాయాలను నమోదు చేసిన వెల్చేరు నారాయణరావు, 'కన్యాశుల్కం' ఒక అపూర్వ సృష్టి పేరిట సెట్టి ఈశ్వరరావు రాసిన వ్యాసం (తెలుగు కన్యాశుల్కంతో పాటు విశాలాంధ్ర ప్రచురణాలయం వారు క్రమం తప్పక ప్రచురిస్తున్నది)లో వెయ్యోవంతు కూడా సాధించలేకపోయారు. కొత్త ఆలోచనలంటూ తప్పటడుగులు వేసి, తడబడిన అడుగులతో పడిపోయిన వైనం, 'కన్యాశుల్కం' నాటకం గురించి ఇప్పటికే అందుబాటులో వున్న విస్తార రచనలను చదివిన వారెవరికైనా ఇట్టే అర్థం అవుతుంది. ఎటొచ్చీ వెల్చేరు నారాయణరావు అభావ చేష్టల వల్ల వచ్చిన ప్రమాదమేమిటంటే, తన బుర్రలోని గందరగోళమంతా అంతర్జాతీయ పాఠక లోకంపై రుద్దారన్నది.

సక్రమంగా, సజావుగా, సాహిత్య చరిత్ర పట్ల విధేయతతో, నూటా ఇరవై ఏళ్ళ క్రిందటి కాలం పట్ల పారదర్శక విశ్లేషణతో, పూర్తి చేయాల్సిన కన్యాశుల్కం అంతర్జాతీయ ప్రతి తయారీ అనే బృహత్కార్యాన్ని భ్రష్టు పట్టించారు వెల్చేరు వారు. నాటకం లోపలి అనువాద విధానాలు, రీతులు ఎంత దివ్యంగా వున్నాయో ప్రస్తావించ పూనుకుంటే అది మరొక వ్యాసం అవుతుంది. గిరీశం బుచ్చమ్మను లేవదీసుకుపోయిన సందర్భంలో అగ్నిహోత్రావధాన్లు పట్టలేని ఆగ్రహంతో "ఈ గాడిద కొడుకు యింగిలీసు చదువు కొంపముంచింది" అని వెంకటేశం జుత్తు పట్టుకుని కొట్టబోతాడు. అలాగే 'కన్యాశుల్కం' నాటకాన్ని దాని సామాజిక ప్రయోజనం నుంచి దూరంగా లేవదీసుకుపోయే ప్రయత్నం యింత పకడ్బందీగా చేసిన వెల్చేరు నారాయణరావు యింగిలీసు చదువు తెలుగువారి కొంప ముంచినంత పని చేసింది. ఈ ముంపులకు గురికాకుండా నిలదొక్కుకోగల శాశ్వత నివారణ ప్రణాళికలు అమలు చేసుకోవాల్సిన బాధ్యత తెలుగు వారి పైనే వుంది.

**సెల్ : 98492 00385**

కథ

# గుండెకోత చతురులు



- మంతెన సూర్యనారాయణరాజు

**ఈ రోజుల్లో ఎవర్ని నమ్మాలో ఎవర్ని నమ్మకూడదో అర్థం కాకుండా వుంది. నిన్న ఆయన ఈ మధ్య చాలాకాలంగా జలుబు చేస్తే తగ్గడం లేదని వాపోయారు. ఎరక్కపోయి పక్కింటి భవానీ గారితో ఈయనకిలా ఉందంటే డాక్టర్ నివాస్ దంపతుల 'ఆరోగ్య సదన్'కి వెళ్ళమని చెప్పింది.**

తీరా నివాస్ దగ్గరకెళ్ళగానే కన్సల్టేషన్ ఫీజు వందా చెల్లించుకున్నాం. డాక్టర్ నివాస్ కళ్ళ రెప్పలు కిందికి నొక్కి చూశాడు. స్టెత్‌తో చెక్ చేశాడు. అంతే! బ్లడ్‌సుగర్, యూరిన్, షుగర్, లంగ్స్ (ఊపిరితిత్తులు), మోషన్ టెస్ట్, కిడ్నీ ఎక్స్‌రేలంటూ ఓ చిట్టా రాసిచ్చాడు. ఎలాగయితే మర్నాడు సెలవు పెట్టి అన్నీ చేయించేటప్పటికి సాయంకాలమయ్యింది. డబ్బు క్షవరం. అన్ని టెస్టులకూ ఏమాత్రమో తక్కువగా పాతికవందలు. ఎక్కిన ఆటో ఎక్కకుండా ఊళ్ళో ఎన్ని చోట్లు తిరిగామో ఆ భగవంతుడికే తెలియాలి. ఈవెనింగ్ ఆయనా, నేను వెళ్ళి వాటిని డాక్టర్‌కు చూపెట్టే ప్రయత్నం చేశాము. ఆయన వాటిని ఏదో నామమాత్రంగా చూసి "చూడండి గురుమూర్తిగారూ! మీ వయస్సు ఎలాగూ యాభై అయిదు దాటిపోయింది గనుక ఇ.సి.జి., ఎండోస్కోపీ కూడా పనిలో పనిగా తీయించుకుంటే మంచిది" అన్నాడు. అవి కూడా అయ్యాక రేపు సాయంకాలం ఇదే టైమ్‌కి రండి. మళ్ళీ నేను రెండ్రోజుల్లో చెన్నై వెళ్ళే పనుంది" అన్నాడు.

మా ఆయన డాక్టర్ దగ్గర్నుంచి బైటికి రాగానే "ఏమేవ్ విలాసినీ! నాకు తెలీకడుగుతానూ! నాకు వచ్చిన జలుబు పేరు చెప్పి ఇన్ని టెస్టులు చేయించుకోవడం అవసరం అంటావా?" అని అడిగారు. విలాసిని భర్త వైపు చూస్తూ ముఖం చిట్లించింది. "నెమ్మది... డాక్టర్ వింటాడు. బైటికి వెళ్ళాక మాట్లాడుకుందాం" అంది. డాక్టర్ గురుమూర్తి మాటలు ఆలకించినట్టున్నాడు. "హలో గురుమూర్తిగారూ! చిన్న పామైనా పెద్ద కర్రతో కొట్టాలంటారు మీబోటి పెద్దలు. అవి అన్నీ చేయించుకుంటే మీకే మంచిది. లేదంటే గోప్యంగా మీ శరీరంలో అల్సర్ ఉందో, కేన్సర్ ఉందో, టి.బి. ఉందో, మూత్రపిండాల్లో గాని, కిడ్నీల్లో గాని మరి ఎటువంటి దోషాలున్నా ఎలా తెలుస్తుంది? మీ ఇష్టం ఏవోటి రాసివ్వమంటే ఏంటి బయోటిక్ కాప్సూల్స్, బలం బిళ్ళలు రాసిచ్చేస్తాను. అయినా ఎలాగూ ఆల్‌మోస్ట్ ఆల్ అన్నీ చేయించుకున్నారుగా" అన్నాడు నివాస్. మారుమాట్లాడకుండా గురుమూర్తి భార్యను తీసుకుని వెళ్ళి ఆటో ఎక్కేశాడు.

. . .

ట్రాన్స్‌ఫర్ మీద తమ పక్క ఇంట్లో అద్దెకు దిగిన ఆ భార్యాభర్తల్ని చూసి "ఆ డాక్టర్‌గారి హస్తవాసి చాలా మంచిదనుకోండి. ఆయనది మా కులమే! భార్య ఇంటరెకేస్ట్ అనుకుంటా! ఎటువంటి జబ్బయినా పావలా టాబ్లెట్‌తో తగ్గించేస్తాడు సుమా!" అంది గొప్పగా భవాని. "ఆ... మా ఆయనకు చేసింది జలుబు. అయిన క్షవరం ఇప్పటికి పాతిక వందలపై చిలుకు. రేపు ఇంకా కొన్ని టెస్టులు చేయించుకొమ్మని రాసిచ్చాడు" అంటూ భవాని మాటకైనా ఎదురు చూడకుండా విసవిసా ఇంట్లోకి వెళ్ళిపోయింది. పెందరాళే వంటావార్పూ ముగించుకుని

భోజనాదికాలు కానిచ్చింది విలాసిని. గురుమూర్తి దంపతుల పెద్ద కొడుకు భగవతీ ప్రసాద్ హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. చిన్న కొడుకు రాజేంద్ర గుంటూర్లో మెడికల్ రిప్రజెంటేటివ్. ఆమె భర్త తాలూకు టెస్టులు వైద్యం గురించి సెల్‌ఫోన్ ద్వారా కొడుకులిద్దరి చెవిలో వేసింది. చిన్నాడు అంతగా పట్టించుకోలేదు. పెద్దాడు తల్లికి క్లాసు పీకాడు. "నేను మా కంపెనీలో ఇద్దరికి ఫొటోలు పెట్టి హెల్త్ కార్డులు తీయించాను. ఇంతలో ఏం మునిగిపోయిందని విజయవాడలో ఎవరో ఏదో చెబితే విని డబ్బులు క్షవరం చేసుకున్నారు?" అంటూ చిరాకుపడ్డాడు. "ఒరేయ్! ఇందులో నాన్నగారి తప్పు ఏమీ లేదు. తప్పుంటే అదంతా నాదే! రొంప తగ్గడం లేదని ఎరక్కపోయి పక్కింటి భవానీగారికి చెబితే మాకు తెలిసిన డాక్టరున్నాడు. పావలా టాబ్లెట్‌తో తగ్గించేస్తాడంటే మనసొప్పక తీసుకెళ్ళా!... అంతే... ఉన్నవీ లేనివీ మొత్తం అన్ని జబ్బులకూ అన్ని టెస్టులు రాసి పారేశాడు. ఇంకా రేపు కొన్ని పరీక్షలు చేయించాలి. ఖర్చు తడిసి మోపెడయిందనుకో" అంది.



"సరే! మీ ఇష్టం!" అంటూ ఫోన్ పెట్టేశాడు భగవతీ ప్రసాద్. కాసేపు టి.వి. చూసి భర్త ఉన్న గదిలో కెళ్ళిపోయింది విలాసిని.

మరునాడు పదిగంటలకే ఆఫీసుకెళ్ళాడు గురుమూర్తి. గంట పర్మిషన్ పెట్టి డాక్టర్ నివాస్ రాసిచ్చిన మిగిలిన టెస్టులు చేయించుకుని తిరిగి ఆఫీసుకొచ్చాడు. సాయంకాలం ఐదు గంటలకు ఆఫీసులో పని అయిపోగానే రిపోర్ట్స్ తీసుకుని ఇంటికెళ్ళాడు గురుమూర్తి. అతని చిన్న కొడుకు రాజేంద్ర గుంటూరు నుంచి వచ్చినట్టున్నాడు. తల్లి విలాసిని అతనికి హార్లిక్స్ సీసా నిండా ఏదో పచ్చడి పెట్టి ఇచ్చింది. "నాన్నగారూ! ఎలా ఉన్నారు? మందులేమైనా కావలసి వస్తే చెప్పండి. వస్తాను. రేపు గూడూరు క్యాంపుకెళ్ళాలి" అంటూనే ఆటో పిలిచి ఎక్కేశాడు రాజేంద్ర.

ఏమీ అనలేక అలాగేనన్నట్టు తలాడించాడు గురుమూర్తి. స్నానం చేసి భార్యని రెడీ అవమని నివాస్ ఆసుపత్రికి వెళ్ళేందుకు రెడీ అయ్యాడు. ఆటో దిగి పేషెంట్సున్న హాల్‌లోకి వెళ్ళేటప్పటికి ఇంకా నలుగురు పేషెంట్లు ఉన్నారు. వాళ్ళు టి.వి. చూస్తున్నారు. ఎంతసేపటికి డాక్టర్ కన్సల్టేషన్ రూమ్‌లోకి వెళ్ళడం లేదు. నర్స్ వచ్చి సార్ మీరు అర్జెంటైతే వెళ్ళి కలవండి అంది. వెంటనే గురుమూర్తి, విలాసిని ఇద్దరూ డాక్టర్ రూమ్‌లోకి వెళ్ళారు. రిపోర్టులు చూస్తూ అసంతృప్తిగా తలాడించి "మూర్తిగారూ! నాకెందుకో మీ ఆరోగ్య పరిస్థితి మీద అనుమానం ఎక్కువగానే ఉంది. హైదరాబాద్ వెళ్ళి యాంజియోగ్రామ్ చేయించుకోండి. అక్కడ అంత ఎక్విప్‌మెంటున్న కార్పోరేట్ ఆసుపత్రిలో నా ఫ్రెండ్ కార్డియాలజిస్ట్ డా॥ ధరమ్‌వీర్ ఉన్నాడు" అని హాస్పిటల్ పేరు మీద ఉన్న లెటర్ హెడ్ మీద రాసి ఇచ్చాడు నివాస్.

రెండు రోజులు సెలవు పెట్టి వెళ్ళండి. అక్కడ మీ వాళ్ళెవరయినా ఉన్నారా? అని అడిగాడు గురుమూర్తిని. "ఓ! మా పెద్దబ్బాయి అక్కడే సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా చేస్తున్నాడండీ!" అని చెప్పింది విలాసిని.

"గుడ్! నో ప్రాబ్లమ్. ఇప్పుడు మీరు అక్కడికి వెళ్ళేదాకా ఈ మందులు వాడండి అంటూ ప్రిస్క్రిప్షన్ చేతిలో పెట్టాడు. వీటిని మా కాంపౌండ్‌లో గల షాపులో తీసుకుని, మీ మిసెస్‌ని వాటిని నాకు చూపించమనండి. వాడే విధానం చెబుతాను" అన్నాడు. గురుమూర్తి మందులు కొని భార్యకిస్తే అవి ఎలా వాడాలో డాక్టర్ చెప్పాడు. ఇద్దరూ ఆటోలో ఇంటి ముఖం పట్టారు. అద్దె కొంప రాగానే ఆటోవాడికి డబ్బులిచ్చి పంపాడు గురుమూర్తి. వంటావార్పులు, భోజనాలు అయ్యాక భార్య బిళ్ళలు, కాప్సూల్స్ ఇచ్చి నీళ్ళిస్తే వేసుకున్నాడు. అనుమానమొచ్చి తెలిసున్న మిత్రుడి ఇంటికి ఫోన్ చేశాడు గురుమూర్తి. తాను మింగిన మందులు, గొట్టాల పేర్లు చెప్పి, అవి ఎందుకు పనిచేస్తాయని అడిగాడు. అవన్నీ బలానికి, రోగ నిరోధక శక్తి పెంచేందుకు, నిద్రపట్టడానికి అని చెప్పి, ఇంతకీ నీకొచ్చిన జబ్బేమిటో చెప్పావు కాదు అన్నాడు స్నేహితుడు.

"జలుబుగా ఉంటోందిరా ఈ ఊరొచ్చాక" అన్నాడు. ఆ మిత్రుడు గట్టిగా నవ్వేస్తూ కొత్తగా ట్రాన్స్‌ఫరైనప్పుడివన్నీ కామన్. రెండ్రోజులు రెండు ఔన్సుల విస్కీతో ఏ బిరియానీనో లాగించేస్తే ఎప్పుడో తగ్గి పోయుండేది గదరా. ఈ దిక్కుమాలిన టెస్టులు, మందులు వాడకుండా సరిపోయేది అన్నాడు.

నిన్ను భయపెట్టి ఆ డాక్టరెవడో బాగా చేతి చిలుం వదిలించేశాడు. గోటితో పోయేదానికి గొడ్డలిదాకా పోవడం అంటే ఇదేరా అంటూ ఆట పట్టించాడు. స్నేహితుడన్న మాటలు పెళ్ళాంతో చెప్పాడు గురుమూర్తి. "అనవసరంగా ఆ భవానీ మాటలట్టుకుని నేనే మిమ్మల్ని వదండి చూపించుకుందురుగానని నెట్టుకుంటూ తీసుకెళ్ళాను. పాపిష్టిదాన్ని. మూడువేల పై చిలుకు దాకా క్షవరం అయింది. ఇప్పుడు ఇంత జరిగాక మానివేయలేం కదండీ! వెళ్ళామంటారా వద్దంటారా? పోన్లెద్దురూ ఈసారికి వెళ్ళి ఆ కాస్త వైద్యం కూడా చేయించుకుంటే పోలే! ఖర్చులో ఖర్చు మరో రెండువేలు. పెద్దాడు నిష్ఠూరంగా మాట్లాడాడు. మనం కూడా హెల్త్ కార్డు ద్వారా ట్రీట్‌మెంట్ వుంటే చేయించుకోవచ్చును" అంది విలాసిని.

"సరే నీ ఇష్టం, అలాగేలే! నాకు నిద్దరొస్తోంది" అన్నాడు ఆవులిస్తూ గురుమూర్తి.

...

ఆరోగ్య సదన్ పేరుతో 'గుడ్ హెల్త్ ఆసుపత్రి' అనే దాన్ని నెలకొల్పి డాక్టర్ నివాస్ ఫిజీషియన్‌గా, అతని భార్య గైనకాలజిస్టుగా లేడీ డాక్టర్ ఎటు జెడ్ కుమారి వైద్యం చేస్తున్నారు. నివాస్ డాక్టర్ చదువుతూ తన కాంటెంపరరీ కుమారిని ప్రేమించి ఇంటర్‌కాస్ట్ మ్యారేజ్ చేసుకున్నాడు. వాళ్ళిద్దరి ప్రాక్టీసూ మూడు పురుళ్ళూ, ఆరు చికెన్‌గున్యా కేసుల్లా బ్రహ్మాండంగా సాగిపోతుంది. నివాస్ సలహా మీద గురుమూర్తి, విలాసిని దంపతులు హైదరాబాద్ పెద్దకొడుకు భగవతీ ప్రసాద్ ఇంటికి

బస్సులో బయల్దేరారు. తండ్రి తాలూకు రిపోర్టులన్నీ పరిశీలించాడు భగవతి ప్రసాద్. డాక్టర్ ఎందుకు ఎక్స్‌పర్ట్‌ను కలవాలన్నాడోనని ఆలోచించి శనివారం తల్లిదండ్రుల్ని తీసుకుని నివాస్ రాసిన కార్పొరేట్ ఆసుపత్రికి ఆటోలో బయల్దేరాడు. హార్ట్ స్పెషలిస్ట్ ధరమ్‌వీర్ అప్పాయింట్‌మెంట్ కోసం శ్రమపడాల్సి వస్తుందనుకున్నాడు ప్రసాద్. కాని వెంటనే దొరికింది. ధరమ్‌వీర్ సూచన మేరకు తండ్రిని ట్రెడ్‌మిల్ దగ్గరకు తీసుకెళ్ళి నడిపించి మళ్ళీ దాని తాలూకు రిపోర్ట్ కాస్త ఆలస్యం గావడంతో ధరమ్‌వీర్‌కు ఏదో అర్జెంట్ ఫోన్ వస్తే భజరంగ్ బుట్టేకి యాంజియోగ్రామ్ పని అప్పచెప్పాడు. భగవతీ ప్రసాద్ పదివేలు కట్టి రిపోర్ట్స్ కోసం తిరిగి బుట్టే దగ్గరకు వెళ్దామని స్నేహితుడు తగిల్తే మాట్లాడుతూ ఉండిపోయాడు.



ధరమ్‌వీర్ ఇప్పట్లో రాకపోవచ్చు అని చెబుతూ భజరంగ్ బుట్టే అని పేరు గల ఒక భారీ విగ్రహం ఆ రిపోర్ట్స్ తీసుకున్నాడు. ఆ మనిషి పేరు, మెడల్ తగిలించిన ఐడెంటిటీ కార్డుని బట్టి భజరంగ్ బుట్టే అని, ఇతనూ డాక్టరే అనుకున్నాడు భగవతీ ప్రసాద్. ఆ రిపోర్ట్స్ అటూ ఇటూ తిప్పాడు భజరంగ్ బుట్టే. వెంటనే కనీసం 'స్టెంట్స్' అయినా ఈయనకు అవసరం పడుతుంది. గుండె కోసి బైపాస్ సర్జరీ వడకపోవచ్చు. ఎనీవహా రేపు తీసుకువచ్చినా సరే, ఎల్లుండి తీసుకొచ్చినా సరే! ఆపరేషన్‌కి నేను ముందుగా కొంత ప్రిపేర్ చేసుకోవాల్సి ఉంటుంది. అప్పటిదాకా ఈ మందులు తీసుకోండి అని ఒక లిస్ట్ మందులు రాసిచ్చాడు. గురుమూర్తి బుర్రంతా ఖరాబయింది. విలాసిని మనసు అల్లకల్లోలంగా మారింది. మీరెక్కడ పని చేస్తున్నారని అడిగాడు బుట్టే భగవతీ ప్రసాద్‌ని. ఫలానా కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పని చేస్తున్నానని తన ఐడెంటిటీ చూపాడు ప్రసాద్. మెడికల్ రీ-యంబర్స్‌మెంట్ కింద చూపవచ్చు. క్యాష్ కట్టక్కర్లేదు. కేవలం తొంభైవేలతో వదిలిపోతుంది. ఇందులో 2.5 అంటే రెండున్నర లక్షల ప్యాకేజీ వుంది. అది అవసరం లేకపోవచ్చు. మీ కార్డ్ మీద పని జరిగిపోతుంది లెండి అంటూ నవ్వాడు భజరంగ్ బుట్టే. అది చేయించేస్తే అసలు మీ ఫాదర్‌కి ఇంక ఏ ఇబ్బందీ ఉండదని అభయమిస్తున్నట్లుగా చెప్పాడు. మీరు ఎప్పుడొచ్చేదీ నాకు ఫోన్ చేయండి అంటూ తన సెల్ నెంబర్ ఇచ్చాడు భజరంగ్ బుట్టే.

గురుమూర్తి, భార్య విలాసిని, భగవత్ ప్రసాద్ కార్డియాలజీ విభాగంలోంచి బయటకొచ్చారు. "ప్రసాద్! శ్రీకంఠమూర్తిని కలవాలనుందిరా" అన్నాడు గురుమూర్తి. అదే హాస్పిటల్‌లో తన చిన్ననాటి స్నేహితుడు. హైస్కూల్‌లో క్లాస్‌మేట్ అయిన శ్రీకంఠమూర్తి ఫిజిషియన్‌గా పని చేస్తున్నట్లు తెలుసు. శ్రీకంఠమూర్తికి ఈ ఆసుపత్రిలో మంచి పేరూ, పలుకుబడీ ఉన్నాయి. "అలాగే నాన్నా!" అంటూ భగవతీ ప్రసాద్ ఎంక్వయిరీలో అడిగితే సెకండ్‌ఫ్లోర్ అని చెప్పడంతో లిఫ్ట్‌లో సెకండ్ ఫ్లోర్‌కి వెళ్ళారు ముగ్గురూ. "నాన్నగారూ ఏదయినా టిఫిన్ తిందామా? అన్నాడు భగవతీ ప్రసాద్. అలాగేనని ముగ్గురూ లైట్‌గా టిఫిన్ చేసి, టీ తాగారు. గురుమూర్తి శ్రీకంఠమూర్తి అనే బోర్డు చూపుతూ కొడుకుతో "వాడేరా నా ఫ్రెండ్" అన్నాడు. జనం చాలా మంది అతని కోసం వెయిటింగ్‌లో వున్నారు. ఎంతసేపు నిలుచుంటాం అని వెయిటింగ్ హాల్లో ఛైర్స్‌లో కూలబడ్డారు. ఖాళీగా ఉండలేక ఆ రోజు పేపర్ తిరగేయసాగాడు గురుమూర్తి. ఒక పేజీలో 'సకాలంలో వైద్యం జరగక నిష్కారణంగా బలైన గర్భిణీ' అని బాక్స్ కట్టి న్యూస్ వేశారు. ఒకపక్క గైనకాలజిస్ట్ డాక్టర్ కుమారి ఫొటో, ఇంకోపక్క చనిపోయిన గర్భిణీ స్త్రీ ఫొటో ఉంది. తీరా విషయంలోకి వెళితే గురుమూర్తి తను జలుబు చూపించుకోవడానికి వెళ్ళిన డాక్టర్ నివాస్ భార్య ఆమె అని బోధపడింది. బిడ్డ అడ్డం తిరిగినందువల్లో లేక మరే ఇతర కారణాల వల్లో ఆపరేషన్ చెయ్యాలందట కుమారి. ఆ పేషెంట్ తండ్రి "అమ్మా నువ్వు అడిగినంత సొమ్ము ఇప్పుడు నా దగ్గర లేదు. ఇరవై వేలే ఉంది. మాది పక్క ఊరు. గంటలో తెచ్చి ఇచ్చేస్తాను. ఈలోగా నువ్వు ఆపరేషన్ చెయ్యి. ఆలస్యం అయితే నా బిడ్డా దక్కదు. తన శిశువూ దక్కదు" అని బ్రతిమాలాడు. ఆమె చెప్పిన మొత్తం సొమ్ము కడితేగాని నీ కూతురికి ఆపరేషన్ చెయ్యనని మొండికేసి తాత్సారం చేసిందట. సకాలంలో ఆపరేషన్ జరగక శిశువు అడ్డం తిరిగి తల్లీ, గర్భస్థ శిశువు ఇద్దరూ కొద్దిసేపట్లోనే చచ్చిపోయారు. ఆ గర్భవతి తండ్రి గర్భశోకంతో కోపోద్రిక్తుడై నా బిడ్డ ప్రాణాన్ని చేజేతులా తీసిన డబ్బు రాక్షసి అని తిట్టి అతని బంధువులంతా ఏకమై డాక్టరమ్మను దేహశుద్ధి చేసిన భోగట్టా చక్కగా పొందుపరిచారా న్యూస్ ఐటెమ్‌లో. గురుమూర్తి తను చదివాక "ఈ న్యూస్ చూశావా? అంటూ విలాసిని చేతికి పేపర్ ఇచ్చాడు. ఆ వార్త చదివిన విలాసిని ఎడం చేత్తో బుగ్గలు నొక్కుకుంటూ "పీనుగు మీద కూడు తినే వ్యక్తులంటే ఇటువంటి వాళ్ళేమరి... మంచి పని చేశారు ఆ చనిపోయిన అమ్మాయి తండ్రీ, అతని బంధువులూ" అంది. ఈలోగా భగవతీ ప్రసాద్ బైటికెళ్ళి సిగరెట్ తాగి నోరు కడుక్కుని తండ్రి దగ్గరకు తిరిగి చక్కా వచ్చాడు. "నాన్నగారూ! మీ విజిటింగ్ కార్డు ఉంటే ఇవ్వండి ఇక్కడ చాలా లేటయ్యేలా ఉంది" అని గురుమూర్తి కార్డు ఇవ్వగానే అది తీసుకుని ఎంట్రెన్స్ దగ్గర నిలబడిన బాయ్ దగ్గరకెళ్ళాడు. వాడికి దానిని ఇస్తూ "దీనిని డాక్టర్‌గారికి చూపించు. అర్జంట్!" అన్నాడు. వాడు రెక్‌లెస్‌గా "ఆగండి ఆగండి అందరి కేసులూ అర్జెంటే!" అన్నాడు. మేమొచ్చింది వైద్యానికి కాదు డాక్టర్‌గారు మా నాన్నగారికి క్లాస్‌మేట్" అని పదినోటు వాడి జేబులో వేశాడు భగవతీ ప్రసాద్. ఆలస్యం చేయకుండా ఆ బాయ్ ఆ విజిటింగ్ కార్డు తీసుకెళ్ళి డాక్టర్‌గారి ముందుంచాడు. అది చూసి శ్రీకంఠమూర్తి ఆశ్చర్యపోతూ "ఈ పేషెంట్ వెళ్ళాక ఆయనని రమ్మను" అన్నాడు. వెంటనే డాక్టర్‌గారు చెప్పిన ముక్కలే వచ్చి గురుమూర్తి చెవిలో వేశాడు. విలాసిని పేపర్ చూస్తూ ఉండమని చెప్పి ఆ పేషెంట్ వెళ్ళిపోగానే తండ్రీ కొడుకులిద్దరూ శ్రీకంఠమూర్తి ఉన్న గదిలోకెళ్ళి నమస్కరించారు.

"ఎన్నేళ్ళయింది గురూ నిన్ను చూసి? ఏమిట్రా అలా అయిపోయావు? ఆ పొట్ట, కళ్ళకి జోడు! ఎంత మారిపోయావు" అంటూ స్నేహితుడికి షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. శ్రీకంఠమూర్తి కామెంట్లకి నవ్వేస్తూ,

# మేము సూర్యపుత్రులం!

- ఫేంటన్ జాన్సన్ (అమెరికన్ నీగ్రో కవిత)
హిందీ నుంచి తెలుగు సేత : నిర్మలానంద
సెల్ : 9133510634



మేము సూర్యుని సంతానం
ఉదయిస్తున్న ఎర్రెర్రని సూర్యుని సంతానం!
మేము దక్షిణ ప్రాంతపు దేశాల అదృష్టాన్ని నేస్తున్నాం
ఆ రహస్య క్షణం కోసమే నిరీక్షిస్తున్నాం

మా ప్రవక్త ప్రత్యక్షమయ్యేటపుడు
ఆయన చేతిలో వుంటుంది సత్యమనే మెరిసే ఖడ్గం!
ఆయన వద్ద వున్న ఉక్కులో సౌభ్రాతృత్వపు స్నేహం
వుంటది మరింత దృఢంగా
ఆయన ఆకాశంలో ఎర్రని అక్షరాలతో రాస్తారు
"స్వాతంత్ర్య! సౌభ్రాతృత్వం!"

మేము నక్షత్ర జాతికి చెందినవారం!
పోరాడటమే మా ప్రవృత్తి!
మేము దుఃఖభరిత గీతాలను జోకొట్టి నిద్రపుచ్చాము
మా తప్పుడు తుపాను వేగపు ఆదేశం
మమ్ములను వదలిపోయి వుండిన చంద్రకిరణాల
వద్దకు తీసుకుపోతుంది
నిరాశ నిండిన రాత్రిలో
మేము పోగొట్టుకున్నాము చంద్రకిరణాలను
అయినా తిరిగి నక్షత్రాల నీడలో
ఇంద్రజాలపు గుర్తులున్న చోటుకి మేము చేరుకుంటాము
అక్కడ రెండు పదాలు మెరుస్తున్నాయి!
"స్వాతంత్ర్యం!"
"సౌభ్రాతృత్వం!!"

మేము మేఘాలనూ, పొగమంచునూ చీల్చుకొని
మరీ వచ్చేము
శక్తివంతులం మేము! బలాఢ్యులం!!
గోధూళి మా నిద్ర కళ్ళని చుంబించింది
వైభవశాలి అయిన ఆకాశంలో
ఒక రహస్యమైన సింహాసనాన్ని
స్థాపించుకున్నాము మేము!
అది ఎన్నటికీ మాదే!
మేము ప్రవక్త సంతానానిమి!
ఆయన ఎల్లపుడూ గానం చేస్తారు
"స్వాతంత్ర్యం! సౌభ్రాతృత్వం!" అంటూ..

---

సరేలేరా, నీలా నేనేమీ డాక్టర్‌ని కాదుగా ఏ మార్పూ లేకుండా మెయింటెయిన్ చేయడానికి? అంటూ తన కొడుకుని స్నేహితునికి పరిచయం చేశాడు. కుశల ప్రశ్నలూ, చిన్ననాటి జ్ఞాపకాలు అయ్యాక తనొచ్చిన విషయం చెబితే ఒక పని అయిపోతుందని గురుమూర్తి తను అక్కడికి ఎందుకొచ్చిందీ, ఎవరు పంపించిందీ సొంతం చెప్పాడు. డాక్టర్ రిపోర్ట్స్ చూపించమంటే ఎక్స్‌రేలు, టెస్ట్‌లన్నింటి తాలూకు రిపోర్టులూ, యాంజియోగ్రామ్ వివరాలూ అన్నీ పరిశీలించాడు శ్రీకంఠమూర్తి. భగవతీ ప్రసాద్ కలగజేసుకుంటూ "అంకుల్! నాన్నగార్ని ముందు ధర్మవీర్ చూసి మళ్ళీ ట్రెడ్‌మిల్ రిపోర్ట్ తియ్యమంటే తీయించాం. యాంజియోగ్రామ్ తీసే టైంకి ఆయన ఎక్కడికో వెళ్ళిపోయారు. అప్పుడివన్నీ తీసుకెళ్ళి ఆయన అసిస్టెంట్ గావును జైగాన్టిక్ పర్సనాలిటీ భజరంగ్ బుట్టేకి వీటిని చూపాం! ఇందులో ఆయనేం చూశాడో, ఏం పాడో 'స్టెంట్స్' వేయాలని, ఈలోగా ఈ మందులు వాడమని ఇవన్నీ రాసిచ్చాడు" అన్నాడు. పెద్దగా నవ్వేస్తూ శ్రీకంఠమూర్తి "పిచ్చి గురుమూర్తీ! నీ రిపోర్ట్స్‌లో పెద్దగా డిఫెక్ట్స్ ఏమీ లేవు. వయస్సుకు తగ్గట్టుగా ఫ్యాట్ కంటెంట్స్ వున్నా, భయపడకు. కొలెస్ట్రాల్ కంట్రోల్ చేసుకో. ఈ మందులన్నీ ఎక్కడ తీసుకున్నావో తిరిగి అక్కడే ఇచ్చేసెయ్యండి. అతను డాక్టరు కాదు, పాడూ కాదు. చూడ్డానికి డాక్టర్ అమ్మా మొగుడిలా వుంటాడు. కానీ ల్యాబ్ టెక్నీషియన్ అతను. ఎన్ని మందులు రాశాడు! నీ గుండె మంచి కండిషన్‌లోనే ఉంది. కాకపోతే రోజూ రెండు మూడు గంటలపాటు వాకింగ్ చేస్తూ వుంటే చాలు. ఆపరేషన్ అక్కర్లేదూ, గాడిదగుడ్డూ అక్కర్లేదు" అంటూ అప్పటిదాకా గురుమూర్తి గుండెల మీద వున్న బరువు తొలగించేశాడు.

"మరి మేం వస్తాం అంకుల్" అంటూ లేచాడు భగవతీ ప్రసాద్. గురుమూర్తీ లేచాడు. శ్రీకంతమూర్తి నవ్వుతూ డాక్టర్ నివాస్‌కి, వీళ్ళకి అంటే ఈ ధరమ్‌వీర్, భజరంగ్ బుట్టే గాళ్ళందరికీ ఆయా శాతాల్లో ఆపరేషన్లు చేస్తే కమిషన్లు ఉంటాయి. అదంతా వృత్తికి సంబంధించిన సీక్రెట్‌లే. వీళ్ళంతా గుండెకోత చతురులే! నలుగురూ బతకాలి కదరా! అనవసరంగా డబ్బులు తగలేసి ఆపరేషన్లు చేయించేసుకోవడం, ఓవర్‌గా మందులు మింగేయడం వల్ల సైడ్ ఎఫెక్ట్స్ బోల్డు ఉత్పన్నమవుతుంటాయి. అన్నట్టు మీ డాక్టర్ నివాస్ పెళ్ళాన్ని అదే ఎ టు జెడ్ కుమారిని అరెస్టు చేశారు. రాత్రి టీవీలో చాలా ఛానల్స్ ప్రసారం చేశాయి. "సరే నే వస్తాను మూర్తీ" అన్నాడు గురుమూర్తి. తిరిగి నవ్వుతూ ఆసుపత్రికి ఎంతో జబ్బుపడితే తప్ప రాకు. వెళ్తాను అని చెప్పు. నేను చెప్పిన ముక్కలు ఎక్కడా అనకు..." అన్నాడు శ్రీకంఠమూర్తి. మిత్రులిద్దరూ పడిపడి నవ్వుకున్నారు. బైటికొస్తున్న తండ్రీకొడుకుల్ని చూసి విలాసిని వారి దగ్గర కొచ్చింది. కొడుకు చెప్పగా విషయమంతా విన్న విలాసిని నవ్వు ఆపుకోలేకపోయింది. తిరిగి ముగ్గురూ నవ్వుకున్నారు. మందులు రిటన్ ఇచ్చి వస్తా నాన్నా నడుస్తూ వుండండి అని ప్రసాద్ షాపు వైపు నడిచాడు. ■

# ఆదివారమంతా సాహిత్య పఠనమే

- షేక్ రియాజుద్దీన్ అహమ్మద్

సాహితీ స్రవంతి అనంతపురం అధ్వర్యంలో ఫిబ్రవరి 12న జరిగిన 'కవిత్వంపై శిల్పశాల' కార్యక్రమానికి హాజరు కావడం జరిగింది. వృత్తిరీత్యా తెలుగు పండితుడిగా తరగతి గదిలో విద్యార్థులకు తెలుగుభాషను బోధిస్తూ ఆ భాషా మాధుర్యాన్ని పంచడానికి అవకాశం లభించింది. గతంలో అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయంలో "ఉమర్ అలీషా నాటకాలు -విశ్లేషణ" అనే అంశంపై పరిశోధన 1992 లో గురువర్యులు అలీజనాబ్ కా॥ షేక్ మస్తాన్ పర్యవేక్షణలో చేయడం జరిగింది. సామాన్యుడి వ్యథ "కీర్తి కిరీటం" కవితలు, ఎం.ఏ. చదివే సమయంలో "దేఖోఖాలా" అంటూ పేరడీని రాయడం జరిగింది. ఆంధ్రభూమి దినపత్రికలో సరదా కామెంట్ ప్లీజ్ శీర్షిక వెలువడుతుండేది. ఆ శీర్షికకు రెండు పంక్తుల్లో భావాన్ని అర్థం చేసుకొనే విధంగా సమాజానికి అనుగుణంగా రాయమన్నప్పుడు రాసి పంపేవాణ్ణి. కొన్ని పత్రికల్లో కూడా అచ్చయ్యాయి. "సాహిత్యం - సహజీవనం" "కల్లూరు సుబ్బారావు అనంత సేవలు" "ఉమర్ అలీషా నాటక ఇతివృత్తం" వంటివి అనంత ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. ఈ మధ్య సాహితీ స్రవంతి వారు విద్యార్థులకు కవితా పోటీలను, ఉపాధ్యాయులకు వ్యాస రచన పోటీలను నిర్వహించడం ముదావహం. కేవలం ఉపాధ్యాయుడు బోధనలకే పరిమితం కాకుండా సాహిత్యావగాహన కలిగించుకోవాలన్న ఉద్దేశ్యంతో వారికి పోటీలు నిర్వహిస్తున్న నేపథ్యంలో పోటీలో పాల్గొని "ప్రపంచీకరణలో కనుమరుగు అవుతున్న తెలుగుభాషను పరిరక్షించడమెలా?" వ్యాసం రాయడం జరిగింది. అందులో తృతీయ బహుమతి పొందడం జరిగింది. బహుమతి ప్రధానం కాదు కానీ సాహితీ స్రవంతి వారు "వెన్నుతట్టే ప్రోత్సహించడం" నాకు నచ్చింది. ప్రతిరోజు వచ్చే దినవార పత్రికలన్నీ చదవడం. ఆదివారం రోజు ఆంధ్రప్రభ, వార్త ఆదివారం అనుబంధాల్లో వచ్చే శీర్షికలను చదవడం' పదరంగం, పదరసం, పద వినోదం వంటి వాటిని పూరించి పంపుతుంటాను. పదరంగం పూరించాలంటే చారిత్రక, రాజకీయ, సాహిత్య పత్రికలను పూర్తిగా అవగాహన చేసుకోగలుగుతున్నాను. తెలుగు సాహిత్యాలకు సంబంధించిన పుస్తకాలన్నింటిని చదవడం ఆదివారం వచ్చిందంటే చాలు సాహిత్య పఠనంతోనే జరుగుతుంది.

అనంతపురంలో జరిగే సాహితీ సభలకు హాజరు కావడం వల్ల ప్రముఖ కవుల ప్రసంగాలు విని ప్రభావితం కావడం జరిగింది. "అవినీతిపై సమరం" సాహితీ స్రవంతి వారు నిర్వహించిన సభకు హాజరైనప్పుడు వివిధ కవులు, కవయిత్రులు ఎలా కవిత్వాన్ని సంధిస్తున్నారు అన్నది తెలుసుకొని రచన వ్యాసంగాన్ని మొదలుపెట్టడం జరిగింది.

"ఒకరోజు ఏదైనా ఒక కవిత రాయకపోతే నాకు నిద్రరాదు" అంటారు రాధేయ. మన చుట్టూ జరిగే పరిస్థితులను అవగాహన చేసుకొని నీకు రాయాలని ఏది తోస్తే దాన్ని అక్షర రూపంలో పెట్టు" అనడం నచ్చింది. దాంతో కవిత్వం రాయడానికి ఒక ప్రేరణ అయింది.

"సద్గోష్టి సిరియు నొసగును
సద్గోష్టియే కీర్తిఁబెంచు, సంతుష్టియనా
సద్గోష్టియె యొనగూర్చును
సద్గోష్టియె పాపములను చఱచుకుమారా"

సజ్జనులతో కలిసి సాహితీ సభలలో పాల్గొని రాసిన కవితలను వినిపించడం జరుగుతూ ఉంది.

తెలుగు సాహిత్యానికి వెయ్యేళ్ల చరిత్ర ఉంది. నన్నయ నుంచి నన్నెసాబు వరకు ఎందరో కవులు తెలుగు సాహిత్యసేవ చేశారు, చేస్తున్నారు. ఈ మధ్య "అక్షరశిల్పులు" అనే ఒక పుస్తకం వెలువడింది. అందులో సుమారు 331 మంది ముస్లిం కవులు తెలుగు భాషను అభ్యసించి ఆంధ్రదేశంలో నివసించి, రచనలు చేసి ప్రజా జీవనాన్ని చిత్రిస్తూ మేల్కొలుపుతున్నారు. ఆ కవులలో నాకు కూడా స్థానం కల్పించారు. ఎం.ఏ.ఎం.ఫిల్ వరకు తెలుగులోనే చదవడం కారణంగా ప్రాచీన, ఆధునిక సాహిత్యాలను పఠించడం జరుగుతూ ఉంది. "గురువిజయం" నాటకానికి రాతప్రతులు. ఆంధ్రభూమిలో పద్యానికి ప్రాణం పోసిన దరియా హుస్సేన్ వ్యాసం రాయడం జరిగింది. అది పత్రికలో ప్రచురించడం జరిగింది. ఇదేకాక "ఇండియా" మాసపత్రికను చదవడం దానికి స్పందనగా వార్త' ఆదివారం అనుబంధంలో లేఖలు రాయడం.

"సాహితీ స్రవంతి" నిర్వహించే కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటున్నాను. నేడు కుమారస్వామి తమ ప్రోత్సాహంలో "కవిత్వం నాడు తీరు తెన్నులు" అన్న అంశాన్ని వివరించారు. కవుల, కవితా ధోరణులు, కవితలలో వచ్చే మార్పులు వివరించారు. మల్లెల నరసింహమూర్తి వివిధ కవులు రాసిన కవితలను చదివి వినిపించారు. కవితా రచన రాసే సందర్భంలో వస్తువును, రూపాన్ని దృష్టిలో ఉంచుకొని కవితల రాయాలని మెళుకువలను తమ ప్రసంగంలో వినిపించారు. నిరంతరం సాహిత్యాన్ని అధ్యయనం చేయాలన్నారు. క్రిష్ణయ్య, మధురశ్రీ, జూటూరు షరీఫ్, ఆకుల రఘురామయ్య కవితలను వినిపించారు.

చాసో, కొకు, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు వంటి కవుల కావ్యాలను శ్రీశ్రీ, చలం మొదలగు వారిని గూర్చి బోధించే సందర్భంలో వారికి సంబంధించిన పూర్తి సమాచారాన్ని తెలుసుకోవాలని పుస్తకశాలలను దర్శిస్తూ గ్రంథాలయాలకువెళ్తూ సాహిత్య పఠనం గావిస్తున్నాను.

స్పందన

# కవిత్వము, సాహిత్యము, సామాజిక తీరుతెన్నులు

**- డా॥ అంకె రామలింగమయ్య**

మారుతున్న సమాజాన్ని బట్టి కవిత్వం సాహిత్యం మార్పును ఆశించి, ఆధునిక దృష్టితో కవిత్వాన్ని రాయవలసి ఉంటుంది. కవిత్వం మనోభావాల్ని ప్రతిబింబిస్తే, సామాజిక భావాలను ప్రతిబింబింపజేసేది సాహిత్యము, కవిత్వము కావ్యాలు రెండూ ప్రాచీన కాలం నుంచి అనేక రకాల విశ్లేషణ దృశ్యాలను విపులీకరిస్తాయి. అవి కవి యొక్క అంతరాంతరాల నుంచి వస్తూ ప్రతీకరణాలు చేస్తుంటాయి. కవి ఏ సమకాలీన సమాజాన్ని గురించి తాను భావావేశాన్ని పొందుతాడో, దాని నుంచి సమాజ చైతన్యాన్ని స్థాపించాలనుకుంటాడు. దానికి కవి తనకు ఎదురైన సామాజిక జీవనసరళిని, పరస్పర సంఘర్షణ ద్వారా జడపదార్థంగా వున్నా, మానవతా విలువల్ని చైతన్యవంతంగా, సాహిత్య వస్తు ప్రపంచాన్ని, సామాజిక శిల్ప - సౌందర్యాన్ని, విమర్శనా దృక్పథంతో సమాజానికి దర్శింపచేస్తాడు. అంటే కవి సాహిత్యపరంగా సమాజంలో తన్ను తాను ఆవిష్కరింపజేస్తాడు, తాను సామాజికుడై మనుషుల భావాలను, వ్యక్తుల అభిప్రాయాలను, పాత్రల ద్వారా మారుతున్న కాలాన్ని బట్టి, భవిష్యత్ పరిణామాలను చిత్రీకరిస్తాడు. మరి నేటి నాగరిక ప్రపంచంలో ఆంగ్ల ప్రభావం మన సాహిత్యాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తున్నది, తరతరాల కవిత్వ సాహిత్య రచనలు, నిస్వార్థంగా, నిస్సంకోచంగా కవిత్వ సాహిత్య రంగాలను, సామాజిక విమర్శకుడై, సమాజమే సాహిత్య ప్రపంచమని, చెప్పగలిగిననాడే ఆ సాహిత్యం కవిత్వం, శాశ్వత విలువలు పొందుతాయి.

---

# శిల్పశాల అనుభవాలు

**- మధుర శ్రీ**

సమాజంలో మనవంతు కర్తవ్యాన్ని మనం నెరవేర్చడానికి కవిత్వం రాయాలి. సమాజంలో మార్పు తీసుకురావడానికి సాహిత్యం ఎంతో సహకరిస్తుంది. మనసులోని భావాలను వ్యక్తపరచడానికి సాహిత్యం ప్రక్రియల్లో కవిత్వానికే ఎక్కువ ప్రాధాన్యత ఉంది. కవిత్వం సామాన్య పాఠకుడి గుండెల్లో ఏకదాటిగా చొచ్చుకొని పోయి పామరులు సహితం వినగలిగేలా చేస్తుంది. అంతటి గొప్ప శక్తి కవిత్వానికి ఉంది. శిల్పం, భావచిత్రాలు, ప్రతీకలు ఆ వస్తువు సన్నివేశాల్ని సూటిగా చెప్పం దుకు ఉపకరిస్తాయి. ఆ విధంగా రాసిన కవిత్వమే చిరకాలం నిలుస్తుంది. కవిత్వం చదివేటప్పుడు కవి వాడిన పదబందాలు రిపీట్ కాకుండా చూసుకోవడం అంత్యప్రాసలకు చెల్లుచీటి రాసి కవితాత్మకు ప్రాధాన్యత ఇవ్వడం నేర్చుకోవాలి. గాఢత ఎంత శాతం పెరిగితే వస్తురూపం అంత అద్భుతంగా పండుతుంది. ఈ మధ్య చదివిన కవితా పుస్తకాలలో పరమాత్మ అన్న కవి మార్పురీ గది అన్న కవిత చదివాను అందులో ఇంటర్ చదివిన విద్యార్థి పరీక్షలకు తట్టుకోలేక సబ్జెక్టులు పెట్టే బాధలు తట్టుకోలేక పురుగుల మందు తాగి మరణిస్తారు. అప్పుడు తల్లిపడే వేదన అతని కవిత్వంలో చొప్పించారు. ఎందుకు మందు తాగావు కన్నా నీవు పోతే మా గతేమిటి. పరీక్ష ఒక్కటే జీవితమను కున్నావా అలా భావించకు నీవు ఉంటే మేము బతికినట్లే నాన్న అంటుంది.

సాహిత్య విమర్శనారంగానికి వస్తే రాధేయ విమర్శనా పుస్తకం కవిత్వం 'ఒక సామాజిక స్వప్నం' అన్న పుస్తకాన్ని చదవడం జరిగింది. అందులో 25 వస్తువులపై రాష్ట్రం మొత్తం మీద 370 మంది కవులు ఎలా స్పందించారో వాటిని వివరించడం జరిగింది. ఉదా॥ దుఃఖాన్ని స్పృశించిన 15 కవితలను సేకరించడం జరిగింది. ఎక్కడెక్కడో పడిన పుస్తకాలను గత 30సం॥లుగా సేకరించి అందులో దుఃఖానికి సంబంధించిన వాటిలో శిల్పాన్ని సేకరించి విశ్లేషణ చేయడం చాలా కష్టం. అందులో శిల్పానికి ప్రాధాన్యమున్న వస్తువులనే ఎన్నుకోవడం రాధేయ ప్రత్యేకత. ఇలా 25 వ్యాసాలు చదివాను.

సాహిత్య పత్రికలు మంబాయివన్, చినుకు, నది, మూసి, పాలపిట్ట, విశాలాక్షి, నేటినిజం, సాహిత్య ప్రస్థానం, నడుస్తున్న చరిత్ర, నెలవంక నెమలీక, ఆంధ్రప్రదేశ్, ఆకాశిక్, మల్లెతీగ, మల్లెపందిరి లాయర్ ఇలాంటి పత్రికలు చదువుతుంటాను. ఇందులో శిల్ప ప్రధానమైన పత్రికలలో సాహిత్య ప్రస్థానం చాలా గొప్ప సేవచేస్తోంది. ఇంట్లో వ్యక్తులు, కవులకు సపోర్టు ఇవ్వాలి. కవికి ఉదార స్వభావం ఉండాలి, త్యాగం చేయాలి, త్యాగమే మనిషిని కవిగా నిలుపుతుంది. గత ఐదు సంవత్సరాలుగా రాష్ట్రంలో సాహిత్య పఠనం పెరిగింది. శిల్పపరమైన కవిత్వము కొన్ని పత్రికలలో వస్తోంది. కొన్ని పత్రికలలో మాత్రం చాలా చెత్త కవిత్వం వస్తోంది. ప్రాంతీయతలకు ప్రాధాన్యత ఇవ్వకుండా వాదాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా కవిత్వానికి మాత్రమే భావాలకు అనుకూలంగానే ప్రాధాన్యత ఇచ్చినట్లయితే గొప్ప పత్రికలుగా నిలిచిపోతాయి. పత్రికల పోషణ కూడా చాలా అవసరం పోషణ లేనిదే పత్రిక బతకదు. కుటుంబ సభ్యులు కూడా కవులపై వారి ఆలోచనలకు అనుగుణంగా సమీకరించాలి. ఈ ఏడాది నాకవితా రచనలు 20 దాకా ఉన్నాయి. మధురశ్రీ గా 'మథనం' కవితా సంపుటి వేసిన తరువాత ఈ 20 కవితలు రాసాను. అందులో "పొద్దువాలుతున్న దృశ్యంలో" అన్న కవిత మరియు 'తీరం లేని దుఃఖం' అన్న కవితలలో మంచి శిల్పాన్ని తీసుకు వచ్చానని అనిపిస్తుంది. కన్నడ సాహిత్య శిల్పం కన్నా తెలుగు సాహిత్యశిల్పం ఎంతో రమ్యంగా ఉంటుంది.

---

# ఉన్నది ఉన్నట్లు చూడాలి

కవిత అనునది అర్థముగాని పెద్ద సమాసములతోను విచ్చేదన చేయుటకు వీలుగాని సంధులను వాడి వ్రాయుటకన్నను సామాన్యులకు సైతము అర్థమగుచూ మానసిక అహ్లాదము మాత్రమే గాక, జీవన ఉపయోగము కొరకు ఉపయుక్తమగునది యై ఉండాలి.

మానవతా విలువలు మేల్కొల్పునట్లు ఉండాలి.

దయామయమును మేల్కొల్పునదై యుండాలి

సమాజమును చదువగలుగునది యై యుండాలి.

సంఘర్షణ నుండి మార్పు వచ్చుననుట అందరికీ తెలిసిన విషయమే.

మార్పును అధ్యయనము చేయు శక్తి మరియు ఉన్నది ఉన్నట్లు చూడగల శక్తి కావలయును.

**- సి. రామానుజులు**

## కవిత్వ అంశాలపై శీర్షిక ఉండాలి

- కవిత్వము చదువుతున్నాను. సమాజంలో భావాల సంఘర్షణ జరుగుతున్నప్పుడు చైతన్యాన్ని కలిగించేలా, మార్పు తెచ్చేలా వుండాలి.
- సాహిత్య విమర్శలు గమనిస్తున్నాను. డా॥ రాధేయగారివి, డా॥ రావి రంగారావు గారి విమర్శలు గమనిస్తున్నాను. వాటి విశ్లేషణ మార్గనిర్దేశంగా వుంది.
- దినపత్రికల సాహిత్యపేజీలు, ఆదివారం అనుబంధాలు, సాహితీ ప్రస్థానం, సాహితీ కిరణం, భావతరంగిణి, విజ్ఞాన సుధ, నది, ఆశ, ముంబాయివన్, బిలైవాణి, రమ్యభారతి, ఎక్స్‌రే, ఆంధ్రప్రదేశ్ అనుసరించాను. ఇప్పటివరకు పై పత్రికలన్నీ. ఇప్పటి నుంచి సాహితీ ప్రస్థానం కూడా.
- సాహిత్య పఠనం నాకు పెరిగింది.
- బంధు మిత్రులు, సన్నిహితుల కన్నా ఇప్పుడు సాహితీ మిత్రుల విషయాలు, సలహాలు నాకు కవిత్వమునకు మార్గదర్శకులు.
- సాహిత్యం సమాజాన్ని మార్చగలదు. అందుకే సాహిత్యభిరుచి కలుగుతోంది.
- నేను హృదయ స్పందన, ఆకుల తోరణాలు రాశాను. ఇంకా ముద్రితం కాలేదు. (కవిత్వం)
- రాజకీయ సామాజిక అంశాలపై ప్రచురించే సాహిత్యేతర పుస్తకాలపై పఠనం చేస్తున్నాను.
- ఈ ఏడాది 15 పుస్తకాలు కొన్నాను. అన్నీ సాహిత్య గ్రంథాలే.
- సాహితీ రంగంలో ప్రపంచీకరణ నేపథ్యంలో నష్టపోతున్న అన్నదాతపై రచనలు రావాలి.
- స్థానికంగా అనేక సాహిత్య సంఘాలు ఉన్నప్పటికీ కొన్ని మాత్రమే పనిచేస్తున్నాయి. కొత్తతరం కవులకు అవకాశాలు తక్కువగా ఇస్తున్నారు.
- ముంబాయివన్, సాహిత్య కిరణం, సాహిత్య ప్రస్థానం, తెలుగు పలుకు, భావ తరంగిణి, తాడిపత్రి, సమాచార్.
- ప్రస్థానం 2011 నుంచి చదువుతున్నాను. 'ఈ ప్రస్థానం' నాకు మార్గనిర్దేశం అవుతుందనుటలో ఏ సందేహం లేదు.
- ప్రస్థానంలో కవిత్వాన్ని ఎలా తీర్చిదిద్దాలి. భావాల సంఘర్షణను కవిత్వంగా ఎలా మలచుకోవాలి అనే అంశాలపై శిల్పంపై వస్తువుపై, సాహితీ శీర్షిక ప్రవేశపెట్టితే బాగుంటుందని ఆశిస్తున్నాను.
- సాహిత్యం కోసం సాహితీసేవ చేయగలను.

**- ఆకుల రఘురామయ్య**

సెల్ : **9581384016**

## నూతన రచయితలను ప్రోత్సహించాలి

- Fountain head, Midnight children, ఏడు తరాలు, ఒక సెక్స్ వర్కర్ ఆత్మకథ, యమకూపం...వంటివి చదివాను. అన్నీ నచ్చాయి.
- కవిత్వం, సామాజిక ప్రకంపన, కవిత్వం, మనిషి దిద్దుబాటు
- ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, దినపత్రిక సాహిత్య పేజీలు నచ్చాయి.
- పెరిగింది.
- వారు సాహితీ ప్రియులు కారు.
- ఇంగ్లీషులో తెలుగులో సమపాళ్లుగా చదువుతుంటాను.
- రాసాను "ఘోష" కవితా సంపుటి
- బాగా చదువుతుంటాను.
- తరతరానికి చదువు పట్ల పెరుగుతున్నది.
- దాదాపు 50,000/- రూపాయల పుస్తకాలు కొన్నాను.
  దాదాపు 30,000/- రూపాయల సాహిత్య గ్రంథాలున్నాయి.
- రాగవాశిష్టం... ఇంకా పలు పురాతన పుస్తకాలు
- లేవు
- నేను కవిని, రచయితని, మానవ వ్యక్తిత్వ వికాస విశ్లేషకుణ్ణి - రచనానుభవాలు పెరిగాయి, మెరుగుపడ్డాయి. రచనా ప్రణాళికలు నెరవేరుతున్నాయి.
- ఈ కాలంలో సాహిత్యరంగంపై ఒకింత నిరుత్సాహం వుంది.
- వారు సాహిత్యం, కవిత్వం... మొదలై ఎలాగ శిల్పం చెక్కాలి అనే వర్క్‌షాపులలో విరివిగా పాల్గొనాలి (వాటిని నిర్వహించేవారు ఉండాలి.)
- యావరేజ్‌గా వుంది. కాని దానికి ప్రోత్సాహం తక్కువే.
- తక్కువ జరిగాయి. అందులో 60% బాగున్నాయి.
- స్థానిక సాహిత్య సంఘాలతో ఐక్యత మెరుగుపడాలి.
- కేవలం 50% ప్రతిబింబిస్తున్నాయి.
- మిసిమి, సాహిత్య స్రవంతి, పాలపిట్ట, నెలవంక నెమలీక.....
- జూలై 2010 నుంచి, బాగుంది చాలా బాగుంది.
- నూతన మంచి కవులకు, రచయితలకూ ప్రధాన శీర్షికన అవకాశం ఇవ్వాలి.
- సాహిత్యం ద్వారా మనిషిని సామాజికంగా, సాహిత్య పరంగా రాజకీయంగా, ఆధ్యాత్మికంగా పరిపూర్ణుణ్ని చేయడానికి బాగా కృషి చేస్తాను, సాహిత్యాన్ని విరివిగా రాస్తాను, అందిస్తాను.

**- డా॥ జెన్నె ఆనంద్‌కుమార్**

సెల్ : **9966450897**

# కొత్త పుస్తకాలు




**గంధం చెట్టు**
గన్నవరపు నరసింహామూర్తి
వెల: రూ.60/- పేజీలు:108




**బహుత్‌ఖూబ్ యాకూబ్**
సౌభాగ్య
వెల: రూ.60/- పేజీలు: 99




**అర్థశాస్త్ర సిద్ధాంతాలు ఓ మిథ్య**
సిరిగాపూర్ విద్యాసాగర్‌రెడ్డి
తెలుగు అనువాదం: నిజాం వెంకటేశం
వెల: రూ.60/- పేజీలు: 96




**ఫ్లోరోసిస్..ఫ్లోరోసిస్..** (దీర్ఘ కవిత)
డా॥ రూప్‌కుమార్ డబ్బీకార్
వెల: రూ.30/- పేజీలు: 43




**అనుధ్వని**
నాగరాజు రామస్వామి
వెల: రూ.60/- పేజీలు: 124




**మనసు పలికె** (కథలు)
భీమరాజు వెంకటరమణ
వెల: రూ.50/- పేజీలు: 107




**నిచ్చెనమెట్ల లోలకం** (కవిత్వం)
జూపల్లి ప్రేమ్‌చంద్
వెల: రూ.70/- పేజీలు: 132




**ఓనమాలు** (కవిత్వం)
నాగరాజు రామస్వామి
వెల: రూ.50/- పేజీలు: 83




**రామకృష్ణ ద్విశతి**
ధర్మవరం సాకె రామకృష్ణ
వెల:రూ.70/- పేజీలు:119




**చీకటి పున్నమి** (కథలు)
వదలి రాధాకృష్ణ
వెల:రూ.125/- పేజీలు:160




**నిర్ణయం**
రాచపూడి రమేష్
వెల:రూ.60/- పేజీలు:104




**అగ్రతలుపులు**
కొండపల్లి నీహారిణి
వెల:రూ.60/- పేజీలు:136




**శారదీయం**
యర్రగుంట్ల సుబ్రహ్మణ్య శర్మ
వెల: అమూల్యం పేజీలు:335






**వ్యాసహారిక**
కొండపల్లి నీహారిణి
వెల:రూ.125/- పేజీలు:165

## నివేదిక

# అమ్మపాల కమ్మదనం తెలుగు భాష

విభేదాలెన్నున్నా అందర్ని ఒక్కటి చేసేది భాష. గత వర్తమాన భవిష్యత్‌కు ఆశాదీపం భాష. ప్రపంచ పురోగతికి భాష శ్వాస వంటిది. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా ఫిబ్రవరి 21న విజయనగరం జిల్లా కేంద్ర గ్రంథాలయంలో 'మాతృభాష చర్చా కార్యక్రమము" జరిగింది. యస్.వి.ఆర్. కృష్ణారావు సభకు ఆహ్వానం పలికారు. ఆయన మాట్లాడుతూ తెలుగు భాషకు లభిస్తున్న విశేషాదరణ వర్ణించలేనిదన్నారు. అందుకే శ్రీ కృష్ణదేవరాయలు తెలుగు భాషామ తల్లిని రతనాలగడ్డపై కూర్చుండ బెట్టారని, తెలుగు మాధుర్యాన్ని, గొప్పతనాన్ని వర్ణిస్తూ శంకరం బాడి మా తెలుగుతల్లికి మల్లెపూలదండ రాసారని, దాశరథి, కాళోజి, శ్రీశ్రీ, ఆరుద్ర, శ్రీపాద వంటి వారు తెలుగు భాష గొప్పతనాన్ని కీర్తించారన్నారు.

***జి.యస్. చలం మాట్లాడుతూ*** భాష ఎప్పుడు స్థిరమైనది కాదని, జీవనది లాంటిదన్నారు. ఒక భాష ఎప్పుడు అచ్చమైనదిగా ఉండదన్నారు. అన్ని భాషలను ఇముడ్చుకోలేని భాష మాతృభాష అవుతుందని, భాష అమ్మఒడి నుండే నేర్చుకుంటామన్నారు. 2000లో మొదటి మాతృభాషా దినోత్సవాన్ని జరుపుకున్నామని, సంస్కృతి మనుషులను ఐక్యంగా ఉంచుతుంది కనుక భాషల గూర్చి ఎవరైన రెచ్చగొట్టినప్పుడు సంయమనం పాటించాల్సిన అవసరం ఉందన్నారు. ప్రపంచ వ్యాప్తంగా మాతృభాష కావాలనుకొనే పరిస్థితి ఏర్పడిందని, వ్యక్తిగతంగా మాతృభాష కావాలనుకుంటే సరిపోదని, ఏ భాషలోనైతే అభివృద్ధిని సాగిస్తామో ఆ భాషలోనే మనుగడ సాగించడం అభివృద్ధికరమన్నారు.

***డా॥ గోపాలరావు ..*** ప్రాథమికంగా తెలుగు నేర్చుకోవాలని, భాషను బ్రతికించుకోవాలంటే విద్యార్థులు, తల్లిదండ్రులు ఉపాధ్యాయులు, పాఠశాలల యాజమాన్యాలు, పత్రికలవారు. పాలకులు ఇలా అందరి కృషి, పాత్ర ఉండాలన్నారు. వ్యవహారిక భాష అంతమైపోతుందని. దరఖాస్తు పత్రాన్ని తెలుగులో రాస్తే చూడని దుస్థితి నెలకొందన్నారు.

***రెడ్డి శంకర్రావు ..*** భాష అంతరించిపోతుందని గుండెలు బాదుకొనే బదులు ప్రభుత్వాలకు మనవెర్షన్‌లో అంటే నిరసన ద్వారా మన అభిప్రాయాన్ని తెలియజేయాలన్నారు.

***ఇ. జానకి ..*** విదేశీ సంస్కృతికి లోనవుతున్నామని, ఈ విషయాన్ని, ఈ కుట్రను ప్రతి తల్లిదండ్రి గ్రహించాలని, వారి వ్యాపార వలలో చిక్కుకోకుండా అప్రమత్తంగా ఉండాలన్నారు.

***పి.ఎస్. శ్రీరామమూర్తి ..*** ప్రతి ఒక్కరు మన భాష గొప్పది అంటున్నారే కాని భాష ఎందుకు అంతరించిపోతుందో గమనించడం లేదని, ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల్లో భాషాపండితులు తెలుగు సంస్కృతులు నేర్చుకున్నవారు కాదని, దీనితో పిల్లలపై ఈ ప్రభావం పడుతుందన్నారు.

***వెంకటేశ్వరరావు..*** మనం టెక్నాలజీని ఉపయోగించు కుంటూ ముందుకు వెళ్ళాలని, లేదంటే వెనుకబడే ఉంటామని, పరభాషలను నిందించకుండా మాతృభాషను కాపాడు కుంటూ సమానమైన గౌరవాన్ని ఇవ్వాలని, ముందు తరానికి ఏ విధంగా అందివ్వాలో ఆ దిశగా కృషి జరగాలన్నారు.

***చెళ్ళపిళ్ళ శ్యామల...*** ప్రభుత్వ పాలనలోనే లోపం ఉంటే ఏ విధంగా సరిదిద్దాలో తెలియడం లేదని, భాషా పండితులు, వేర్వేరు సబ్జెక్టు లలో చదువుకొని రిజర్వేషన్‌పై జీవనోపాధి కోసం వచ్చిన వారే ఉంటు న్నారని, ప్రభుత్వం తరపున ఇటువంటి లోపాలను సరిదిద్దాలని అన్నారు.

వీటిన్నిటిని సమన్వయపరుస్తూ చీకటి దివాకర్- ప్రజల సామూహిక శ్రమ నుండే భాషలుద్భవించాయని ఆయా కాలాల్లో, ఆయా ప్రజల్లో, ఆయా జ్ఞానాల్లో వస్తున్న మార్పులను ఆహ్వానిస్తూ భాష ఈ రోజున ఈ రకమైన పరిపుష్టతను సంతరించుకొన్నదన్నారు. ఏ భాషైతే పరభాషా ఫలాలను తనలో ఇముడ్చుకొని ముందుకు వెళ్తుందో ఆ భాష అభివృద్ధి చెందుతుందని భాష సముద్రం వంటిదాని అన్ని భాషలను ఇముడ్చుకుంటూ ముందుకు వెళ్తుందన్నారు. సహజమైన అభివృద్ధి, మాతృభాషలోనే జరుగుతుందని, ప్రాథమిక విద్య ఇంటి భాషలోనే జరగాలని, మాతృభాషలో పాండిత్యం సంపాదించిన తరువాత మిగతా భాషలు సులువుగా ఆకళింపు చేసుకోవచ్చన్నారు.

ఈ సభలో చంద్రిక, హైమావతీ, తిరుపతి నాయుడు, హైందవి, శ్రేయ పాటలు పాడగా డా॥ డివిజి శంకర్రావు కవితను వినిపించారు. పియస్‌యస్ శ్రీనివాస్ వందన సమర్పణతో సభ ముగిసింది.

**- చంద్రిక రాణి**

# మెరుగు

మహిళా దినోత్సవం సందర్భంగా మార్చి 7వ తేదీన విజయనగరంలో గురజాడవారి స్వగృహాన సాహితీ స్రవంతి మెరుగు కార్యక్రమాన్ని నిర్వహించింది. ముందుగా సాహితీ స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ మహిళల పట్ల వివక్ష అన్ని వర్గాల స్త్రీలలోను వుందని, 20వ శతాబ్దంలోను మహిళల పట్ల అఘాయిత్యాలు, అత్యాచారాలు జరగడం దురదృష్టమన్నారు. మహిళా సాధికారతకై మహిళల ఆలోచనల్లో మార్పు రావాలని తొలి పలుకుల్లో పలికారు. చీకటి చంద్రికారాణి "ఎక్కడమ్మా నువ్వు లేనిది" పాటలో స్త్రీ ప్రాముఖ్యాన్ని తెలిపారు.

విశాఖ ఎ.వి.ఎన్. కాలేజ్ తెలుగు లెక్చరర్ శ్రీమతి సీతారత్నం మాట్లాడుతూ 1980లో గర్భస్థ శిశులోపాన్ని తెలుసుకుని గర్భస్రావాలు

చేశారని, 1994 సం॥లో న్యూయార్క్ టైమ్స్ పత్రిక ద్వారా అమర్త్యసేన్ పురుషులకు సమానంగా స్త్రీలు లేరని, ఆడపిల్లలు పుట్టడం తక్కువైందని చెప్పారని వివరించారు. వంటంతా అమ్మదే అయినా గిన్నెలపై పేరు మాత్రం నాన్నదే అంటూ సమాజంలో వున్న పురుషాధిక్యతను వేలెత్తి చూపారు. పురాణాలలోని స్త్రీలైన గాంధారి, మాంచాల, ద్రౌపదిలు భర్తల వల్ల పొందిన ఆనందం కన్నా వేదనలే ఎక్కువని, అయినప్పటికీ వారు భర్తల క్షేమాన్నే కోరుతూ వారి అయిష్టాన్ని మనసులోనే దిగమ్రింగారని తెలిపారు.

రచయిత్రి చాగంటి తులసి మాట్లాడుతూ మార్పు వ్యవస్థ మూలాల్లోంచి రావాలని, మహిళా దినోత్సవాలో, పురుష దినోత్సవాలో కాక మానవ దినోత్సవాలు జరపాలని, జాతి సమైక్యత ఆవశ్యకాన్ని తెలిపారు. ఏకసూత్రంగా అన్ని జాతులు (ఆడ, మగ) కలిసి కృషి చేయాలని, వ్యవస్థ స్థితిని మార్చాలని అభిప్రాయపడ్డారు. మహిళా రచయిత్రి చెళ్ళపిళ్ళ శ్యామల మాట్లాడుతూ మహినే తనలో దాచుకున్న మహిళ, భూమంత ఓర్పు వహించినా, ఎన్నో వ్యధలను భరిస్తోందని, పసిపిల్లలకు సైతం రక్షణ లేని సమాజస్థితికి ఎవరు కారణమని




మహిళా దినోత్సవం సందర్భంగా మార్చి 7న విజయనగరంలో గురజాడ వారి స్వగృహాన జరిగిన సాహితీ ప్రవంతి మెరుగు కార్యక్రమం

ప్రశ్నించారు. సమస్య ఆడవారిదే అయినా పరిష్కారం పురుషుల చేతుల్లో వుందని, స్త్రీ పట్ల పురుషుల ఆలోచనల్లో మార్పు రావాలని ఆశాభావాన్ని వ్యక్తం చేసారు. సభలో జయంతి విజయలక్ష్మి, ఐ. జానకి, లావణ్య, బి.ఎస్. మోతి, డి. శ్యామల, సనారే, రెడ్డి శంకర్రావు, మానాపురం రాజచంద్రశేఖర్, మొయిద శ్రీనివాస్, గోరుగుంతల రాజశేఖర్, చెళ్ళపిళ్ళ శ్యామల తమ కవితలను చదివి వినిపించారు.

**- చెళ్ళపిళ్ళ శ్యామల**

## అర్ధసత్యం

కొన్ని సందర్భాల మాటల యుద్ధంలో
సంఘర్షణల మధ్య వాదనకు తెరదించాక
ఓటమి అప్రయత్నంగా
అలక పాన్పెక్కి కూర్చుంటుంది
లుకలుకలూ చిటపటలూ పూర్తయ్యాక
ఓ పసికందు
భ్రూణ హత్య దశను దాటి
ద్వంద్వ ప్రమాణాల మధ్య
ఈ లోకంలో ఊపిరి పోసుకుంటుంది
సంస్కృతి కట్టుబాట్ల చట్రంలో
ఆచార వ్యవహారాల ముసుగులో
సాధికారాన్ని కోల్పోయినప్పుడు
సహజీవన సాధింపుల మధ్య
భవిష్యత్తుకి ఆమె ఓ ప్రశ్నార్థకంగా మిగిలిపోతుంది
జెండర్ వివక్షతో
సంసార రథసారధిగా నెట్టుకొచ్చినప్పటికీ
ఇంటా బయటా తొంగిచూసే
యాసిడ్ దాడులతో... శారీరక వేధింపులతో
గృహ హింసలతో
ఎఱ్ఱ జాబిళ్ళ ఎడారినాలుగా మారిపోతుంటే
స్వేచ్ఛనీ... ఆర్థిక స్వాతంత్ర్యాన్నీ కోల్పోయినప్పుడు
'ఆకాశంలో సగం' అన్న మాట
'అవకాశంలో సగం' అన్నట్టుగా మిగిలిపోతుంది
అర్ధసత్యంగానే నిలిచిపోతుంది
నిజానికి -
ఆడపిల్ల ఎప్పటికీ ఆడ'పిల్లే'!
జూలు పట్టుకొని విదిల్చితే మాత్రం
ఆమె ఒక ఆడ'పులే'!

**- మానాపురం రాజా చంద్రశేఖర్**

## ఆకాశంలో సగం

నూరు వసంతాల సంతోషాల హేలలో సంబరాలు జరుపుతున్న
మహిళా ఓ మహిళా నీకు శుభాకాంక్షలు

కార్పొరేట్ రంగంలో కాలుపెట్టి కంప్యూటర్ రంగంలో దూసుకెళుతూ
శాటిలైట్‌లో చంద్రుని చూసొస్తున్నా, గగన కుసుమాలని కాంచి వస్తున్నా
ఒలింపిక్స్‌లో స్వర్ణాలు స్వంతం చేసుకుంటున్నా
చట్టసభలలో సీట్లు కాలేదు ఇంకా నీ సొంతం

అన్నింటా ముందుంటూ మిన్నంటేట్టు, శెహభాష్ అనిపించుకొంటున్నా
ఎంత ఎత్తుకెదిగి ఎంత రాణించిన
ఆగడంలేదు అత్త ఇంట ఆగడాలు అధిక కట్నాల ఆరాటాలు
ఓ మహిళా అమ్మవు నీవే అత్తవు
నీవే అన్నింటా పూజలు అందుకునే దేవతవు నీవే

అమ్మ చూపిన ఆకాశంలో కనిపించిన ఇంద్రధనస్సు సగం
ఇప్పుడు అనిపిస్తున్నది ఆకాశమంతా నిండి ఉన్నది స్త్రీ మూర్తేనని

నూరు వసంతాల విజయాలు సొంతం చేసుకున్న ఓ మహిళా
సాధించాలి ఇంకా ఎన్నో విజయాలు, అంతర్జాతీయంగా ఎంతో ఎత్తుగా

ఈ సంతోషాల వేళ నీకిదే మానవాళి శుభాభివందనాలు

**- మునుగోటి శ్రీ రమేష్**

*(మహిళా దినోత్సవం సందర్భంగా జరిగిన 'మెరుగు' కార్యక్రమంలో చదివిన కవితలు)*

# బోధన మాధ్యమంతోనే భాషాభివృద్ధి

## మోతుకూరి నరహరి



సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 21న జరిగిన 'ఉగాది జనకవనం' సభలో 'తెలుగు భాషా వికాసం-వర్తమాన సమస్యలు' అంశంపై ప్రసంగిస్తున్న మోతుకూరి నరహరి. చిత్రంలో తంగిరాల చక్రవర్తి, గేరా, వొర్రప్రసాద్, గజవెల్లి

బోధన మాధ్యమంతోనే తెలుగు భాష అభివృద్ధి చెందుతుందని ఆంధ్ర సారస్వత పరిషత్ పూర్వ ప్రిన్సిపాల్ మోతుకూరి నరహరి అభిప్రాయపడ్డారు. బోధన మాధ్యమం పట్ల రాష్ట్ర ప్రభుత్వం చిత్తశుద్ధితో వ్యవహరించడం లేదని ఆందోళన వ్యక్తం చేశారు. ప్రపంచీకరణ విధానాలతో తెలుగు భాష మరుగున పడుతోందని, తెలుగు భాషకు ప్రాచీన భాష హోదా లభించినా భాషాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం కృషి చేయడం లేదని విమర్శించారు. ఫిబ్రవరి 21న హైదరాబాద్‌లో సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో 'తెలుగు భాషా వికాసం - వర్తమాన సమస్యలు' అనే సదస్సుకు మోతుకూరి నరహరి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నాగరికుడైన ప్రతివాడూ తెలుగులోనే మాట్లాడాలని సూచించారు. ఆంగ్ల భాషపై మితిమీరిన వ్యామోహం పెంచుకుంటూ తెలుగు భాషను నిర్లక్ష్యం చేయడం సమంజసం కాదన్నారు. అధికార భాషా కమిటీల ద్వారా తెలుగు భాషను మరింత అభివృద్ధి పరిచేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృషి చేయాలని సూచించారు. ఇంటర్మీడియట్ వరకు తెలుగును రెండో భాషగా ప్రకటించి, పదో తరగతి వరకు తెలుగులోనే విద్యను అభ్యసించే విధంగా ప్రభుత్వం చర్యలు చేపట్టాలన్నారు. తెలుగు టీవీ ఛానళ్ళ ద్వారా తెలుగు జాతికి ప్రమాదమేర్పడుతోందని ఆందోళన వ్యక్తం చేశారు. తెలుగు భాషకు ప్రాచీన భాష హోదా లభించినందున తెలుగులో మరిన్ని ప్రయోగాలు చేయాల్సిన అవసరముందని చెప్పారు. మాతృభాష అభివృద్ధికి ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావాలని, అవసరమైతే ఉద్యమాలు చేపట్టాలని ఆయన పిలుపునిచ్చారు. విద్యా వ్యవస్థ పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యం వహిస్తోందని, ఎయిడెడ్ పాఠశాలల్లో ఖాళీగా వున్న ఉపాధ్యాయ పోస్టుల భర్తీకి చర్యలు చేపట్టకపోవడం శోచనీయమన్నారు. అధికార భాషకు ఛైర్మన్‌ను నియమించి మాతృభాషను పరిరక్షించాలన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొర్రప్రసాద్ మాట్లాడుతూ ప్రపంచంలో అనేక భాషలు మరుగునపడుతున్నా నేటికీ తెలుగు భాష ప్రాచుర్యాన్ని కోల్పోలేదని చెప్పారు. ఈ మధ్యకాలంలో ఆంగ్ల భాషకు ఇస్తున్న ప్రాధాన్యం వల్ల తెలుగు భాష ఉనికికి ప్రమాదం ఏర్పడుతుందని ఆందోళన వ్యక్తం చేశారు. మాతృభాష పరిరక్షణ కోసం ప్రతి ఒక్కరూ ఉద్యమించాల్సిన అవసరముందన్నారు. ఆధునిక కాలానికనుగుణంగా తెలుగు భాషను అభివృద్ధి పర్చాలని అన్నారు. ఈ సందర్భగా జరిగిన 'ఉగాది జనకవనం' కార్యక్రమంలో దాదాపు 20 మంది కవులు పాల్గొని స్వీయ కవితలు, పాటలు వినిపించారు. ఈ జనకవనాన్ని గేరా, తంగిరాల చక్రవర్తి నిర్వహించారు. జనకవనంలో పాల్గొన్న కవుల్లో పూసల రజనీ గంగాధర్, మోపిదేవి రాధాకృష్ణ, గేరా, తంగిరాల చక్రవర్తి, సుతారపు వెంకటనారాయణ, జి. నరేష్, వెంకటి, శాంతిశ్రీ, సి. హెచ్. లీలావతి, నాగ శిరీష, జి. యాదగిరిరావు, తుమ్మల మోహనరావు, కోరుపోలు రాధాకృష్ణ, ఆచార్య నరేంద్ర, రాజు, శ్రీమతి రత్నా మహీధర్, గజవెల్లి దశరథ రామయ్య, వి.ఆర్.కె. శాస్త్రి, రాము, శాంతారావు తదితరులు పాల్గొన్నారు. సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ కార్యదర్శి జి. యాదగిరిరావు ఈ సభకు స్వాగతం పలికి, వందన సమర్పణ చేశారు.

# రాష్ట్ర స్థాయి కవితల పోటీ ఫలితాలు

బాలికా భ్రూణ హత్యలను నిరసిస్తూ న్యూవిజన్ సోషల్ మొబలైజేషన్ అండ్ రూరల్, అర్బన్ డెవలప్‌మెంట్ సొసైటీ నిర్వహించిన కవితల పోటీ ఫలితాలను ఆ సంస్థ ప్రతినిధి దాదినబోయిన యేడుకొండలు ఒక ప్రకటనలో తెలిపారు. మౌనశ్రీ మల్లిక్ (హైదరాబాద్) "ఒక ధ్యాన ముద్ర ఛిద్రమవుతున్న ధ్యానం" , టి. వెంకటేష్ (కర్నూలు) "ఆ(కా)శ దీపాలు", సరికొండ నరసింహరాజు (జగ్గయ్యపేట) "పిండ ప్రదానం", తుమ్మల దేవరావ్ (నిర్మల్) "నేను అమ్మనౌతానేమో!", పెళ్ళూరు సునీల్ (నెల్లూరు) "కరుగుతున్న ఆకాశం" కవితలు ఉత్తమమైనవిగా న్యాయ నిర్ణేత డా. అద్దేపల్లి రామమోహనరావు ఎంపిక చేశారని తెలిపారు. పిడుగురాళ్ళలో జరిగే బహుమతి ప్రధానోత్సవ సభలో ఈ అయిదుగురు కవులను ఒక్కొక్కరికి రూ. 1,000/- (అక్షరాల వెయ్యి రూపాయలు) నగదుతో సత్కరిస్తామని తెలిపారు. పోటీకి రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాల నుండి మొత్తం 170 కవితలు రాగా వై. హెచ్.కె. మోహనరావు, కోసూరి రవికుమార్. ఎన్.వి. రత్నశర్మ బృందం ప్రాథమిక పరిశీలన జరిపి 20 కవితలను ఎంపిక చేసారన్నారు. తుది ఎంపికలో న్యాయ నిర్ణేత పై 5 కవితలను ఉత్తమమైనవిగా ప్రకటించారు.

## సిరికి స్వామినాయుడుకు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు



ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు-2011 కోసం సిరికి స్వామినాయుడు కవితా సంపుటి 'మంటి దివ్వె' ఎంపికైందని అవార్డు వ్యవస్థాపకులు డా॥ రాధేయ ఒక ప్రకటనలో తెలియజేశారు. ఈ అవార్డు న్యాయ నిర్ణేతలుగా ఆచార్య సుమతీ నరేంద్ర, డా॥ రావి రంగారావు, రామతీర్థ వ్యవహరించారు.

అవార్డు పొందిన సిరికి స్వామినాయుడు విజయనగరం జిల్లా గుమ్మలక్ష్మీపురం మండలంలోని గిరిజన గ్రామం కుందుకుప్పలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. 'మంటి దివ్వె' వీరి తొలి కవితా సంపుటి.

ఈ అవార్డు పొందిన వారిలో వీరు 24వ వారు. పదునైన వ్యక్తీకరణలతో ఉత్తరాంధ్ర జనజీవితాన్ని 'మంటి దివ్వె'లో కవి వర్ణించారని న్యాయ నిర్ణేతలు అభిప్రాయపడినట్లుగా డా॥ రాధేయ వివరించారు. ఈ అవార్డు ప్రదాన సభ జూలై నెలలో అనంతపురంలో జరుగుతుందని తెలిపారు.

## ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక నూతన కార్యవర్గం

రెండేళ్ళు పూర్తయిన సందర్భంగా ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక మొదటి మహాసభను వరంగల్‌లో కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ఆధ్వర్యంలో దక్షిణ ప్రాంతీయ భాషా కేంద్రం సహకారంతో జరుపుకొన్నదని అధ్యక్షురాలు జాజుల గౌరి ఒక ప్రకటనలో తెలిపారు.

రెండు దశాబ్దాల (1990-2010) తెలుగు రచయిత్రుల గమనం గమ్యం అనే అంశంపై మూడు రోజుల జాతీయ సదస్సు ఈ సందర్భంగా నిర్వహించబడింది.. సృజన విమర్శన రంగంలో తమదైన ముద్ర వేసిన రచయిత్రులు యాభైమంది వరకు ఇందులో పాల్గొన్నారని తెలిపారు. 2012-2014 సంవత్సరాలకు వేదిక కార్యకలాపాలను అన్ని జిల్లాలకు విస్తరింపచేసే లక్ష్యంతో ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక సభ్యులు కొత్త కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. జాజుల గౌరి వేదిక అధ్యక్షులుగా, కాత్యాయనీ విద్మహే ప్రధాన కార్యదర్శిగా, అనిసెట్టి రజిత ఉపాధ్యక్షురాలుగా, కొండేపూడి నిర్మల నిర్వహణ కార్యదర్శిగా, రాజ్యలక్ష్మి కోశాధికారిగా ఎన్నికయ్యారు. భిన్న సామాజిక అస్తిత్వాలకు చెందిన పదిమంది రచయిత్రులు మందరపు హైమావతి (విజయవాడ), తిరునగరి దేవకీదేవి (వికారాబాద్), పద్దం అనసూయ (కొత్తగూడెం), షహనాజ్ ఫాతిమా (కరీంనగర్), పుట్ల హేమలత (రాజమండ్రి), శివలక్ష్మి (హైదరాబాద్), విజయభాను (పాయకరావుపేట), డా॥ నళిని (హైదరాబాద్), కె. సుభాషిణి (కర్నూలు), ఏటూరి జ్యోతి (వరంగల్) కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారని ఆ ప్రకటనలో తెలిపారు.

## కథల, కవితల పోటీ

'సాహితీ కిరణం' మాస పత్రిక తృతీయ వార్షికోత్సవం సందర్భంగా కార్తికా డెవలపర్స్ సౌజన్యంతో కథల పోటీ, డా॥ పట్టాభి కళాపీఠం సౌజన్యంతో కవితల పోటీ నిర్వహిస్తున్నామని సాహితీ కిరణం సంపాదకులు ఒక ప్రకటనలో తెలిపారు. కథల పోటీలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు వరుసగా రూ. 1800/-, రూ. 1200/-, 750/-, ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కరికి రూ. 250/-, కవితల పోటీలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు వరుసగా రూ. 1500/-, రూ. 1000/-, రూ. 500/- ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కరికి రూ. 200/- అందజేయనున్నారు. కథలు, కవితలు దిగువ పేర్కొన్న చిరునామాకు ఏప్రిల్ 30వ తేదీలోగా పంపించవలసిందిగా కోరారు.

సాహితీ కిరణం, ఇ.నెం.11-13-154, అలకాపురి, రోడ్ నెం.3, హైదరాబాద్-500 035 ఇతర వివరాలకు : సెల్ 9490751681ని సంప్రదించగలరు.

## మాతృభాషా దినోత్సవంలో తెలుగు భాషా ప్రశస్తి

ఫిబ్రవరి 21న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో భద్రాచలంలో స్థానిక లిటిల్ ఫ్లవర్ విద్యా సంస్థల ప్రాంగణంలో ప్రపంచ మాతృ భాషా దినోత్సవం సందర్భంగా 'తెలుగు భాషా దినోత్సవం' నిర్వహించడం జరిగింది. ఈ సభలో మాగంటి సూర్యం మాల్యశ్రీ, తాతోలు దుర్గాచారి, వీధుల రాంబాబు, శ్రీధిరాల వెంకటాచారి, జి. రామరాజు, ఆర్.ఎస్. రావు ప్రభృతులు ప్రసంగిస్తూ మాతృభాషయైన తెలుగును సంరక్షించుకోవాలని, మాతృభాష వల్లనే మన సంస్కృతి, సాహిత్యం పెంపొందుతాయని, ప్రభుత్వం, ప్రజలు చిత్తశుద్ధితో తెలుగు భాషాభివృద్ధికి కృషి చేయాలని అన్నారు. ప్రైవేట్ విద్యాసంస్థల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగును నిర్బంధంగా అమలు చేయాలని పిలుపునిచ్చారు. ఈ సభలో సాహిత్యాభిమానులందరూ పాల్గొన్నారు.



గుంటూరులో డాక్టర్ పరుచూరి రాజారామ్ సాహితీ సత్కారాన్ని ప్రముఖ రచయిత, బహుభాషా అనువాదకులు ఎల్.ఆర్. స్వామికి అందజేస్తున్న శ్రీమతి పరుచూరి అజిత, వేదికపై సాహితీ ప్రముఖులు డా॥ పాపినేని శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణ, వల్లూరు శివప్రసాద్



మార్చి 4న కడపజిల్లా పరిషత్ సభా భవన్‌లో డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి కథల సంపుటి 'అనురాగ స్పర్శ' ఆవిష్కరణ సభలో సినీ నిర్మాత మల్లెమాల శ్యాంప్రసాద్‌రెడ్డి, శశిశ్రీ, యోగివేమన యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ఆచార్య అర్జుల రామచంద్రారెడ్డి, ఆం.ప్ర. 20 సూత్రాల కార్యక్రమ అమలు ఛైర్మన్ డా॥ ఎన్. తులసీరెడ్డి, డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి, కథా రచయిత డా॥ మధురాంతకం నరేంద్ర, సన్నపురెడ్డి వెంకట్రామిరెడ్డి, డా॥ మూల మల్లికార్జునరెడ్డి



ఫిబ్రవరి 28న సిరిసిల్ల, ప్రభుత్వ జూనియర్ కళాశాలలో కళాశాల ప్రిన్సిపాల్ బంగారు దశరథం 'అవినీతి పిశాచి' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న దృశ్యం.



మార్చి 4న కడప జిల్లా పరిషత్ సభాభవన్‌లో మల్లెమాల సాహిత్య పురస్కార ప్రదానం, పుస్తకావిష్కరణ, సాహిత్య గోష్ఠి కార్యక్రమంలో డా॥ ఎం.ఎం. వినోదిని, డా॥ మధురాంతకం నరేంద్ర, పి. సత్యవతి, వి. ప్రతిమ, డా॥ పి. సంజీవమ్మ, డా॥ కె. సుభాషిణి




ఫిబ్రవరి 25, 26 తేదీల్లో కేంద్ర సాహిత్య అకాడమీ కోయంబత్తూరులో నిర్వహించిన దక్షిణ భారత, ఈశాన్య రాష్ట్రాల కవిత్వోత్సవంలో తెలుగు కవయిత్రి శ్రీమతి ఎన్. అరుణ స్వీయ కవితా పఠనం చేస్తున్న దృశ్యం. చిత్రంలో తమిళ కవి తేనరసరన్, కన్నడ కవి ఎల్.ఎన్. ముకుందరాజ్, చక్మా భాషా కవి ఉదయ చక్మ, తమిళ కవి పులియరసు, అస్సామీ కవయిత్రి మణికంత భట్టాచార్య, మలయాళ కవి వీరన్‌కుట్టి




అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా కవితల సంపుటి "అగ్ర తలపులు" కి 'She ఫౌండేషన్' తరపున ద్వితీయ ఉత్తమ బహుమతి అందుకుంటున్న కొండపల్లి నీహారిణి . చిత్రంలో ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీనివాస్‌రెడ్డి, చిల్లర భవానీ దేవి తదితరులు



ఉగాది సందర్భంగా విజయవాడలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో
తనికెళ్ళ భరణితో సాహితీ సమాలోచనా సభ



జనవరి 22న విజయవాడలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో
పాటూరి రామయ్య రచించిన 'భూమి కోసం' నాటిక పుస్తకం ఆవిష్కరణ




మార్చి 8న రామచంద్రాపురంలో, ఎస్.కె.పి.పి. జాతీయ ఉన్నత
పాఠశాలలో బండి ప్రసాదరావు రచించిన మూడు పుస్తకాల ఆవిష్కరణ
సభలో (ఎడమ నుంచి) పి. సుబ్బారావు, జి. సుబ్బారావు, డా॥ అద్దేపల్లి
రామమోహనరావు, బండి ప్రసాదరావు, దాట్ల దేవదానం రాజు




ఫిబ్రవరి 12న, యుటిఎఫ్ హాలులో గుంటూరు జిల్లా రచయితల
సంఘం "ప్రతిమాసం - రచన కోసం" కార్యక్రమంలో నిర్వహించిన
"చెట్టు" కవి సమ్మేళనంలో ప్రసంగిస్తున్న ప్రధాన కార్యదర్శి కోసూరి
రవికుమార్, సంఘ ఉపాధ్యక్షులు, డా॥ సిహెచ్. కళావతి, ముఖ్య అతిథి
డా॥ రామడుగ వెంకటేశ్వర శర్మ, ఎస్.ఎం. సుభాని



మార్చి 5న హైదరాబాద్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా
నిలయంలో విద్వాన్ విశ్వంపై ప్రచురించిన రెండు పుస్తకాల
ఆవిష్కరణ సభ దృశ్యం. చిత్రంలో కె. మురళీమోహన్, సుమతీ
నరేంద్ర, రమణాచారి, వరదాచారి, కేతు విశ్వనాథరెడ్డి,
కె.శ్రీనివాస్, నాగసూరి వేణుగోపాల్, ఉడయవర్లు



మార్చి 14న కళా సుబ్బారావు కళావేదిక, హైదరాబాద్‌లో
జివిఆర్ ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన
డా॥ కె. నిర్మలా విశ్వేశ్వరరావు, నూతన రజతోత్సవ వేడుకల
సందర్భంగా డా॥ నిర్మలను సత్కరిస్తున్న 'పద్మశ్రీ' డా॥ శోభానాయుడు.
వివి. రాఘవరెడ్డి, బి. రాధికారెడ్డి, ఎస్.పి. భారతి, మద్దాలి ఉషా
గాయత్రి, గుదిబండి వెంకటరెడ్డి, కళా వేంకట దీక్షితులు



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 40/-




వెల: రూ. 200/-




వెల: రూ. 25/-




వెల: రూ. 30/-




వెల: రూ. 40/-




వెల: రూ. 40/-




వెల: రూ. 35/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 100/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ.200/-




వెల: రూ. 35/-




వెల: రూ. 40/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 150/-

49

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A136 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |